# ఆంధ్రలక్షణసారము

**Inter Part III Advanced Telugu Grammar**
**Prosody and Poeties**

*Compiled in accordance with the latest*
*University Syllabus.*



రచయిత:

వ్యాకరణవిద్యాప్రవీణ, విద్వాన్,
హిందీభాషాప్రవీణ,
చిలుకూరి పాపయ్యశాస్త్రి

# తొలిపలుకు

శ్రీ పీఠికాపురాధీశ కళాశాలలోఁ బండితుఁడుగఁ బ్రవేశించి, మాధ్యమికతరగతి ప్రధానాంధ్రవిద్యార్థులకు (Inter-part III Advanced Telugu Students) "వ్యాకరణము ఛందస్సు అలంకారము" అను నీవిషయములను, ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు నిర్ణయించిన పాఠ్యక్రమమున కనుగుణముగ, సులభ మగురీతిని బోధపఱచుటకై సంగ్రహించి కూర్చిన విషయ మీ 'ఆంధ్రలక్షణసారము' అను గ్రంథరూపమును దాల్చినది.

ఇందలివిషయములను నాయెఱిఁగినకొలఁది నాంధ్రలక్షణగ్రంథముల కవిరుద్ధముగ నుండవలయునని యత్నించి కూర్చియుంటిని. విద్యార్థులకు సులభముగ బోధపడవలయు నను నూహతో నటనట విసంధి పాటింపఁబడినది. దానికి లక్షణజ్ఞులాగ్రహింప కుందురుగాక.

ఈ నారచనలో నేమేని దోసఁగు లున్నఁ బాటింపక గుణ మించుక గల్గిన సేకరింప సహృదయులకు బ్రార్థనకొలు.

ఇట్లు విన్నవించు,

విబుధవిధేయుఁడు,

జయ విజయదశమి } చిలుకూరి పాపయ్యశాస్త్రి.

# SYLLABUS.

The Andhra University Code Vol. II Part I
Chap. XXXIV Page 62-63.
Part III. 7. An Advanced Languages
Telugu Grammar Prosody and Poetics

## I అక్షర ప్రకరణము

(1) ఆంధ్రవర్ణసమామ్నాయము, అచ్చులు, హల్లులు, చూడు:-పుట 2-3. ఉభయములు. హ్రస్వదీర్ఘప్లుతములు, పరుషసరళస్థిరములు 4-5.

(2) ఆద్యానుస్వారశకటరేఫములు 9-11: పదాదియుకారవకారములు 17. కంఠ్యతాలవ్యచజలు 7.

## II పద ప్రకరణము

(1) శబ్దము నైదు విధములు 18. నామవాచకములు. 18-19. సర్వనామములు. 20-21. విశేషణములు. 22-23. క్రియలు 24-34. అవ్యయములు. 39-40.

(2) మహదమహన్నామవాచకములు. 40-42. ఏకవచన బహువచనములు 42-46. ప్రథమావిభక్త్యర్థ విశేషములు 46-49. జడవాచకముల విభక్త్యర్థవిశేషములు. 49-50

(3) సాధారణముగ నామవాచకముల యొక్కయు, సర్వనామముల యొక్కయు సంఖ్యావిశేషణముల యొక్కయు విభక్త్యర్థ సిద్ధరూపములు . . . ౫౩-౫౫.

(4) ద్వివిధవిశేషణములు—గుణవిశేషణములు ధాతుజవిశేషణములు 22-23. విశేషణముల విభక్తివివక్షించునప్పటి తచ్ఛబ్దామ్రప్రయోగము. తత్సమ విశేషణముల లింగ విభక్తి వచనముల విషయము. విశేషణవిశేష్యముల నడుమ అగుధాతుజవిశేషణములు నిలుచుట 56-57.

5. i. ధాతువులు—ఆచ్ఛికధాతువుల యొక్కయు తత్సమ ధాతువుల యొక్కయు దిఙ్మాత్రవివరణము. సకర్మకములు అకర్మకములు ద్వికర్మకములు. 24-25 భూతకాలము, వర్తమానకాలము, భవిష్యత్కాలము, తద్ధర్మార్థకములు, వ్యతిరేకార్థకములు, సామాన్యములగు ధాతువులనుండి పైకాలములందును అర్థములందును గలిగెడి సమాపక క్రియల యుదాహరణములు. 28-34.

ii. సామాన్యములగు ధాతువుల యసమాపకక్రియల సిద్ధరూపములు. అసమాపకక్రియలు మూఁడు విధములు.

(a) నామవాచకములు—భావార్థక వ్యతిరేక భావార్థక కృదంతములు.

(b) విశేషణములు—భూతార్థక వర్తమానార్థక భవిష్యదర్థక తద్ధర్మార్థక వ్యతిరేకార్థకములు.

(c) అవ్యయములు—క్త్వార్థక వ్యతిరేక క్త్వార్థక శత్రుతుమున్నానంతర్య చేదాద్యర్థకములు. 34-36,

iii. కర్మార్థకధాతువులు, ఆత్మనేపదార్థకధాతువులు, ప్రేరణార్థకములు అనువాని వివరణము. 25-28.

iv. క్రియలరూపసాధనలో వచ్చెడి సాధారణములైన పత్వవత్వాది కార్యములు. 37-38.

6. అవ్యయములు—లాక్షణికములు, ప్రతిపదోక్తములు. 39-40.

7. అచ్చతెలుఁగుపదములలోఁగలుగు వర్ణములమార్పులు. అ=వ. అయి=ఐ. అవు=ఔ. ఇయ=ఎ. ఇట్టి సాధారణవిషయములను మాత్రమే చూపవలెను. 57. సాధారణములగు నాచ్ఛికకృదంత తద్ధితాంతములరూపములు. 58-64.

## III వాక్యప్రకరణము

1. కర్త్రర్థకవాక్యము కర్మార్థకవాక్యము ప్రేరణార్థకవాక్యము అను వీని స్వరూపముల వివరణము. 65-69.

2. అన్వయలక్షణము (Analysis) శబ్దలక్షణము (parsing) 69-71.

## ఛందః ప్రకరణము



## అలంకారశాస్త్ర ప్రకరణము

# విషయసూచిక

| | విషయము. | | | పుట. |
|---|---|---|---|---|

శ్రీ శారదాంబాయైనమః

# ఆంధ్రలక్షణసారము

## అక్షరప్రకరణము.

### —ఆంధ్రభాష—

ఆంధ్రదేశమునందలి జనులు వ్యవహరించెడిభాషను 'ఆంధ్రభాష' అని యందురు. ఈభాష తత్సమములు తద్భవములు దేశ్యములు గ్రామ్యములు అను నాల్గువిధములయిన పదజాలముతోఁగూడి యుండును. ఈ ఆంధ్రమునకే తెనుఁగు తెలుఁగు అనునవి పర్యాయపదములు. త్రినగశబ్దమునుండి తెలుఁగుశబ్దమును, త్రిలింగశబ్దమునుండి తెలుఁగు శబ్దమును బుట్టెనని కొందఱు విమర్శకు లూహించి యున్నారు. ఆపద్ధతిని త్రినగముల మధ్య నుండుజనులు వ్యవహరించు భాషయగుటచే తెనుఁగయ్యెననియు, త్రిలింగములమధ్య నుండుజనులు వ్యవహరించుభాష యగుటచే తెలుఁగయ్యెననియు వారి యూహ. త్రినగము లనఁగా శ్రీశైలము శేషశైలము సింహాచలము అను మూఁడుపర్వతములు. త్రిలింగము లనఁగా మల్లికార్జునుఁడు కాళహస్తీశ్వరుఁడు దక్షారామ భీమేశ్వరుఁడు అను మూఁడు లింగములు. ఈయెల్లల నడుమ నున్న జనుల వ్యవహారమున కుపయోగించుభాష యని వారు

నిర్వచనము చేసియున్నారు. కాని యీ తెనుగు తెలుగుశబ్దముల వ్యుత్పత్తిని భాషాశాస్త్రతత్త్వవేత్తలు మఱియొకరీతిగ సమర్థించియున్నారు. తేనెవలె మధురమైనభాష యగుటచే తెనుఁగై తెనుఁగా తెలుఁగైనదని మఱికొందఱి యూహ. వ్యుత్పత్తి యేమయినను ఆంధ్రభాష తెలుఁగుభాష అనునవి పర్యాయపదములుగనే వ్యవహరింపఁబడుచు వచ్చినవి.

## ఆంధ్రవర్ణసమామ్నాయము

ఇట్టి యాంధ్రభాషయందుపయోగించు వర్ణము లేఁబదియాఱు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం ః

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల వ శ ష స హ ళ.

అచ్చులు :—వీనిలో అఆఇఈఉఊఋౠఌౡఎఏఐ ఒఓఔ అను నీ పదియాఱు వర్ణములును అచ్చులు. అందును అఇఉఋఌఎఒ అనునవి హ్రస్వములు; అనఁగా కుఱుచలు. ఆఈఊౠౡఏఐఓఔలు దీర్ఘములు; అనఁగా నిడుదలు. ఏ ఓ లు వక్రములు. అనఁగా వంకరగా నుండునవి. ఐ ఔ లు వక్రతమములు. అనఁగా మిక్కిలి వంకరగానుండునవి యని యర్థము.

ఈ యచ్చులకే స్వరము లనియు, ప్రాణము లనియు నామాంతరములు. 'స్వయం రాజన్త ఇతి స్వరాః' అను వ్యుత్పత్తిచే నితరవర్ణముల సాహాయ్య మక్కఱలేకుండ స్వయముగఁ బ్రకాశించునవి గావున వీనికి 'స్వరములు' అనుపేరు వచ్చినది. అచ్చుల సాహాయ్యము లేనిదే హల్లుల నుచ్చరించుట సాధ్య

పడదు. కాఁబట్టి హల్లుల నుచ్చరించుట కివి ప్రాణముల వంటివి; గావున వీనికి "ప్రాణములు" అను పేరు వచ్చినది.

హల్లులు:—ఇఁక హల్లులు ముప్పది యేడు.

క ఖ గ ఘ ఙ—క వర్గము.

చ ౘ ఛ జ ౙ ఝ ఞ—చ వర్గము.

ట ఠ డ ఢ ణ —ట వర్గము.

త థ ద ధ న —త వర్గము.

ప ఫ బ భ మ—ప వర్గము.

య ర ఱ ల ళ వ—అంతస్థములు.

శ ష స హ—ఊష్మములు.

వీనికి వ్యంజనములు ప్రాణులు అనునవి నామాంతరములు. అచ్చులు పశుపక్ష్యాదుల ధ్వనులలోఁ గూడ వినఁబడుచున్నవి. ఆ యచ్చులకు హల్లులను జేర్చి మనుష్యు లుచ్చరించుటచేతనే యర్థము స్పష్టమగుచున్నది. అర్థవిశేషములను వ్యంజన చేయునవి (ప్రకటించునవి) కాన హల్లులు వ్యంజనములనఁబడుచున్నవి. కూరలు, పచ్చళ్ళు మొదలగునవి వ్యంజనములు. అవి యెట్లు అన్నముతోఁడ్పాటులేనిదే యుపయోగింపవో, హల్లులు నట్లే యచ్చులతోఁడ్పాటు లేనిదే యుచ్చరింపఁబడవు. అందుచేఁగూడ వీని కీపేరు వచ్చియుండనోపును. ప్రాణములతోఁ గూడినవి ప్రాణులు. అనఁగా ప్రాణములైన యచ్చుల సాహాయ్యముననే పలుకఁబడును; గాన వీని కీపేరు వచ్చినది.

ఉభయాక్షరములు:— 1. అర్ధానుస్వారము (ఁ) 2. పూర్ణానుస్వారము (ం) 3. విసర్గము (ః) అను నీమూఁడిం టిని ఉభయాక్షరము లని యందురు. ఉభయాక్షరము లనఁగా అచ్చులుగను, హల్లులుగను, లెక్కింపఁబడున క్షరములు. హల్లుల మీఁదవలె నీమూఁడక్షరములమీఁద అచ్చులు నిలువనికారణ మున నివి యచ్చులుగను, అచ్చులకువలె వీనికి స్వతంత్రప్రయోగము లేకుండుటచేతను, హల్లులనువలె వీనిని అచ్చుల యాధారముతోనే యుచ్చరింపవలయును గనుక నివి హల్లులుగను వ్యవహరింపఁబడును. ఈవిధముగ నీ మూఁడును అచ్చులు హల్లులు నగు నక్షరము లగుటచే నుభయాక్షరము లనఁబడును.

ఇదియునుగాక సాధారణముగ నర్ధానుస్వారముగాని, పూర్ణానుస్వారముగాని నకార మకారముల స్థానమందును, విసర్గము రేఫస్థానమందును ఆదేశముగ వచ్చుచుండును. కావున హల్లులైన నకార మకార రేఫముల స్థానమునం దాదేశ ముగ వచ్చిన యర్ధానుస్వార పూర్ణానుస్వార విసర్గములు హల్లులగును. ఆంధ్రవర్ణసమామ్నాయములో వీని నచ్చుల తోపాటు లెక్కించుటచే నివి యచ్చులు నగును. ఈవిధముగ మీఁది మూఁడు వర్ణములు నుభయాక్షరము లగును.

హ్రస్వదీర్ఘప్లుతములు—అచ్చులలో కుఱుచలు హ్రస్వ ములు. వీని నుచ్చరించుకాల మొక్క మాత్ర (రెప్పపాటు కాలము) గలిగియుండును. నిడుదలు దీర్ఘములు. ఇవి రెండు మాత్రలు గలిగియుండును. మూఁడుమాత్రలు గలిగియచ్చు

లను ప్లుతము లని యందురు. దూరముగ నుండువానిని బిలుచు సప్పుడు తుది యక్షరములను బొడిగించి పలుకుదుము. అట్టి వానినే ప్లుత మని యందురు. ఉదా: రామ 3 కృష్ణ 3.

పరుషసరళస్థిరములు:—క,చ,ట,త,ప,లు పరుషములు. (Hard consonants) అనఁగా కఠినమైన యుచ్చారణముగలవి

గ, జ, డ, ద, బ, లు సరళములు (Soft consonants) అనఁగా మృదువైన యుచ్చారణము గలవి.

మిగిలిన వర్ణము లన్నియు స్థిరములు. (Fixed consonants)

వర్ణోత్పత్తి స్థానములు

అ ఆ క ఖ గ ఘ ఙ హ ః—ఇవి కంఠ్యములు. కంఠ సాహాయ్యముతోఁ బలుకఁబడునవి. (Gutturals.)

ఇ ఈ చ ఛ జ ఝ ఞ య శ—ఇవి తాలవ్యములు. తాలువుసాహాయ్యమునఁ బలుకఁబడునవి (Palatals)

ఉ ఊ ప ఫ బ భ మ—ఇవి ఓష్ఠ్యములు. పెదవుల సాహాయ్యమునఁ బలుకఁబడునవి (Labials)

ఋ ౠ ట ఠ డ ఢ ణ ర ష — ఇవి మూర్ధన్యములు. అంగిలి సాహాయ్యమునఁ బలుకఁబడునవి (Cerebrals)

ఌ ౡ త థ ద ధ న ల స—ఇవి దంత్యములు. దంతముల సాహాయ్యమునఁ బలుకఁబడునవి (Dentals)

ఙ ఞ ణ న మ ం — ఇవి అనునాసికములు. ముక్కు సాహాయ్యమునఁ బలుకఁబడునవి (Nasals).

ఏ ఐ — ఇవి కంఠతాలవ్యములు.

ఓ ఔ — ఇవి కంఠోష్ఠ్యములు.

వ — ఇది దంతోష్ఠ్యము.

య ర ల వ లు—వాని భేదములు

య ర ల వ లు లఘువులు అలఘువులు అని రెండు విధములు. తేల్చి పలుకునపు డివి లఘువులు (Light semivowels) వీనినే యొత్తి పలుకునపుడు అలఘువులు (Harsh semivowels.)

సాధ్యమైన యకారము లఘువు. సాధ్య మనఁగా లక్షణమువలన సిద్ధించునది. మేన+అత్త=మేనయత్త. అది+ఏమి=అదియేమి. ఇట్టిచోట్ల యకారము సంధివశమున ఆగమముగా వచ్చినది. కావున నిది లఘుయకారము. పదములలో స్వతస్సిద్ధముగా నుండు యకారము అలఘువు. కాయ, వాయి, లోయ మున్నగునవి.

రకారము లఘువు— వారు, ఎవరు, కలరు. దీనినే సాధురేఫ మని యందురు. శకటరేఫము అలఘువు—మఱియు, మొఱకు, కఱకు.

లకారము లఘువు. తల నెల పాలు మేలు. బహువచనము పరమగునపుడు ర ల డ ల కాదేశముగా వచ్చిన ళకారము అలఘువు. ఊరు- ఊళ్లు, కాలు-కాళ్లు. త్రాడు-త్రాళ్లు.

సాధ్యమైన వకారము లఘువు. నిద్ర+పోయె=నిద్రవోయె, అతఁడు+పలికె=అతఁడు వలికె. ఇచట వకారము ప్రథ

మావిభక్తిమీఁది షకారమునకు ఆదేశముగా వచ్చినది; గావున లఘువు. స్వతస్సిద్ధమైన వకారము అలఘువు. వాన, కడవ, పడవ.

దంత్యతాలవ్య చ జ లు

అచ్చతెలుఁగుపదము లందలి చ జ లకు తాలవ్యోచ్చారణమును దంత్యోచ్చారణమును గూడఁ గలవు.

ఇ ఈ ఎ ఏ లతోఁ గూడిన చ జ లు తాలవ్యములు. చిలుక చీమ చెట్టు చేట - జిలుగు జీడి జెట్టి జేజే. 'అ ఆ ఉ ఊ ఒ ఓ ఔ' లతోఁ గూడిన చ జ లు దంత్యములు. ఈ వర్ణములతోఁ గూడిన చ జ లను' బలుకునపుడు నాలుకకొన దంతములను దాఁకును. ఇట్టి దంత్యోచ్చారణమునకు గుర్తుగా 'చ జ' లపైని '౨' అను గుర్తు పెట్టవలెను. చలి చావడి చుట్టు చోటు చౌక-జముఁడు జాతర జోదు జౌకు మొదలగునవి.

దంత్యతాలవ్యము లైన చజలు సవర్ణము లగును. అనఁగా దంత్యములైన చకార జకారములకు, తాలవ్యములైన చకార జకారములకు ప్రాసములందు మైత్రి యుండవచ్చును.

ఇకారాంతము లైన తత్సమశబ్దము లందలి యుపధలైన చ జ లు బహువచనము పరమగునపుడు దంత్యము లగును. ఉపధ యనఁగా, చిట్టచివరివర్ణమునకు వెనుకనుండెడి యక్షరము

వీచి- వీచులు. రోచి-రోచులు, రాజి-రాజులు వాజి-వాజులు మొదలగునవి.

## సిద్ధ సాధ్య బిందువులు.

బిందు వనఁగా అనుస్వారము. ఇది పూర్ణము ఖండము అని రెండు విధములు. (ం) ఇది పూర్ణబిందువు. (ఁ) ఇది ఖండ బిందువు. ఈ బిందువు సిద్ధము సాధ్యము అని రెండు విధములు.

కంకెర బంగారము—ఇందలి బిందువు సిద్ధపూర్ణము. అనఁగా శబ్దములందు స్వతస్సిద్ధముగా నుండునది. విచ్చేం గములము. ఇందలి బిందువు సాధ్యపూర్ణము. అనఁగా ద్రుతము బిందువుగా శాస్త్రముచే నిష్పన్నమైనది గావున నిది సాధ్య బిందువు.

మూఁక—ఇందలి బిందువు సిద్ధఖండము.

విచ్చేఁగములము—ఇందలి బిందువు సాధ్యఖండము. హ్రస్వముమీఁది ఖండబిందువు వికల్పముగా పూర్ణబిందు వగును. పడఁతి- పడంతి. అరఁటి—అరంటి.

దీర్ఘముమీఁద సాధ్యపూర్ణము లేదు.

వాఁడు, మూఁక, కాఁకర- మొదలగునవి.

అచ్చ తెనుఁగుపదములలో పరుసవరళములకు ముందే బిందు వుండును. అనఁగా క చ ట త ప - గ జ డ ద బ అను నీ పండ్రెండక్షరములకు ముందే యర్ధానుస్వారముగాని పూర్ణానుస్వారముగాని యుండును.

వంకర, వంగడము, పంచ, వింజామర, గంట, పంతము, పందె, కంబము మొదలగునవి. స్థిరవర్ణములకుముందు బిందు వున్నచో నవి తత్సమపదములే యగును.

కంఠము పంథ వంధ్యము సంవత్సరము సంశయము. అచ్చ తెలుఁగుపదములందు 'అఁట ఇఁక చుఁచు' అనుపదములందుఁ గాక తక్కినపదములలో మొదటిహ్రస్వముతరువాత నరసున్న యుండదు. మొదటిహ్రస్వముతరువాత బిందు వున్నచో పూర్ణబిందువే యుండును.

చెంగల్వ, కందోయి, వింజామర మొదలగునవి.

— అర్థానుస్వారశకటరేఫములు —

అర్థానుస్వారశకటరేఫములు రెండును పదముల యర్థమును నిర్ణయించుటకును, అర్థమును వేఱుపఱుచుటకును నుపయోగించును. తెలుఁగుభాషలో వీని స్వరూపమును దెలిసికొనుట కడునావశ్యకము. ప్రాచీనకాలమునుండియుఁ దెలుఁగు కవులు వీనికిఁ బ్రాధాన్యము నంగీకరించియున్నారు. తరువాతి కాలమున లక్షణకర్తలు తమ గ్రంథములలో వీనికిఁ బ్రత్యేకముగ లక్షణముల నేర్పఱిచియున్నారు. ఒక్కపదమే యరసున్నతోఁ గూడియున్నపుడొక యర్థమును, కూడనప్పుడు మఱియొక యర్థమును దెలియఁజేయుట పరిపాటిగ వచ్చుచున్నది.

| | |
|---|---|
| వీఁడు=దగ్గఱనున్న వాఁడు. | వీడు=పట్టణము |
| వేఁగు=తపించు, బాధపడు. | వేగు=తెల్లవాఱు |
| నీఱు=నిప్పుమీఁదిదుమ్ము. | నీరు=త్రాగెడినీరు |
| వేఱు=ఇతరము. | వేరు=చెట్టువేరు |

ఈ మొదలగుశబ్దములు భాషలో నిర్ణీతస్వరూపములై యుపయోగింపఁబడియున్నవి. ఇట్టివానిని ప్రామాణికులైన కవులు నియమముతోఁ బ్రాసములందుపయోగించియున్నారు.

అనఁగా పద్యములలో ప్రాసస్థానమున అర్ధానుస్వారముతోఁ గూడినవర్ణము ప్రాసముగాఁ గూర్చినచో నాలుగుపాదములందును అర్ధానుస్వారముతోఁ గూడినవర్ణములనే కూర్చుచుండిరి.

వాఁడిమయూఖముల్ గలుగువాఁ డపరాంబుధిఁ గ్రుంకె ధేనువుల్
నేఁ డిటు వచ్చె రేఁతమ నిష్ఠ మొదలు న్నవదగ్నిహోత్రముల్
పోఁడిగ వెల్గెఁ గాని యిదె ప్రొద్దునుబోయెఁ గచుం డిదేలకో
రాఁడు వనంబులోన మృగరాక్షసపన్నగబాధ నందెనో.

ఈపద్యమున నాలుగు పాదములందును అర్ధానుస్వారముతోఁ గూడిన డకారమే ప్రాసాక్షరము. ఇటులనే అనుస్వారముతోఁ గూడనివర్ణము ప్రాసాక్షరమైనచో నాలుగుపాదములందును నట్టివర్ణమునే కూర్చిరి. ఇట్టినియమముతోఁగూర్చిన ప్రాసములు గలపదములు అర్థనిర్ణయమునకు మిక్కిలిఁ దోడ్పడును.

ఈ తీరుననే శకటరేఫములు గలశబ్దములకును సాధురేఫములు గలశబ్దములకును ప్రాసములందు సాంకర్యము లేకుండఁ గవులు కూర్చియున్నారు. కావుననే లక్షణకర్తలు సానుస్వార (అనుస్వారముతోఁ గూడిన) నిరనుస్వార (అనుస్వారముతోఁ గూడని) వర్ణములకు, శకటరేఫ సాధురేఫములకు యతిప్రాసములలో సాంకర్యము కూడదని యనుశాసనముచేసియున్నారు. కాని నేఁటిరచయితలు కొందఱట్టినియమములను బాటింపకయే రచన సాగించుచున్నారు. ప్రామాణికముగఁ బద్యరచన సాగింపవలయునన్నచో ఏవివిభాగము నెఱిఁగి ప్రయోగించుటతో సౌలభ్యముమాత్రే మధికము.

సిద్ధమైనఖండబిందువులు గలపదములను దెలిసికొను
టకు బహుగ్రంథపఠన మావశ్యకము. ప్రాచీనశిలాశాసనముల
లోను తాళపత్త్రిగ్రంథములలోను మన కీనాఁడు అరసున్నతోఁ
గానవచ్చుపదములు నిండుసున్నగలవిగనే యుండును. అయిన
ను గొన్ని పదములలోని ఖండబిందువులను దెలిసికొనుట కిది
యొక యుపాయము. హ్రస్వముమీఁది ఖండబిందువు లోకప్పు
డు పూర్ణబిందువులుగా మాఱునుగదా! ఏనుఁగు-ఏనుంగు.
తలఁచు=తలంచు. కావున నచ్చతెలుఁగుపదములలో వేనిలో
నొకప్పుడు నిండుసున్న కనఁబడునో యాపదములలోని నిండు
సున్న లొకప్పుడు అరసున్నలుగ నుండవచ్చునని నిర్ణయింప
వచ్చును.

దీర్ఘముమీఁది ఖండబిందువు పూర్ణబిందువుగా మాఱుట
గ్రంథములలోఁ దఱుచుగఁ గానరాకున్నను, కొన్నిపదము
లందుమాత్రము వ్యవహారములో నిండుసున్న కనఁబడుచున్నది.
ఆఁబోతు=ఆంబోతు. తాఁబేలు=తాంబేలు. మీఁద=మీంద.
ఇట్లు వ్యవహారములో నున్న నిండుసున్నను జూచియు దాని
స్థానమున ఖండబిందు వుండు నని నిశ్చయింపవచ్చును.

శకటరేఫము మఱియొకహల్లుతోఁ గూడునప్పుడు సాధు
రేఫమే యగును. మాఱుచు=మార్చు. గుఱుతు=గుర్తు.
వేఱు+వేఱు=వేర్వేఱు,

తత్సమపదములలో సాధురేఫములేకాని శకటరేఫము
లుండవు. వరుఁడు, హరి, పరుఁడు.

ద్విత్వము కలిగిన రేఫములు శకటరేఫములే యగును.
కఱ్ఱ, గుఱ్ఱము, మొఱ్ఱ, మొదలగునవి.

— తత్సమాదిభేదములు —

ఆంధ్రభాషయందలి పదములు నాల్గువిధములు

(1) తత్సమములు (2) తద్భవములు (3) దేశ్యములు (4) గ్రామ్యములు.

సంస్కృతపదములకుఁ జివరను ప్రత్యయమును జేర్చి వాడినచో దానికి తత్సమము అని పేరు.

రామ=రాముఁడు. ఆకాశ=ఆకాశము.

ఇచట రామ అను సంస్కృతశబ్దమునకు 'డు' ప్రత్యయమును జేర్పఁగా రాముఁడు అనుపదమును, 'ఆకాశ' అను సంస్కృతశబ్దమునకు 'ము' ప్రత్యయమును జేర్పఁగా 'ఆకాశము' అనుపదమును నేర్పడినవి. ఉదా :—

| సంస్కృతము | తత్సమము | సంస్కృతము | తత్సమము |
|---|---|---|---|
| కుమార | కుమారుఁడు. | సంతోష | సంతోషము. |
| మనుష్య | మనుష్యుఁడు. | ఆశ్చర్య | ఆశ్చర్యము. |
| ధేను | ధేనువు. | దోష | దోషము. |

తత్+సమము=తత్సమము. దానితో సమానమైనది. అనఁగా సంస్కృతముతో సమానమైనది.

సంస్కృతశబ్దమును గొంత మార్పుచేసి వాడినచో దానికి తద్భవము అని పేరు. ఆకాశ=ఆకసము.

ఇచట ఆకాశ అనుశబ్దమునందలి వర్ణములు గొన్ని మార్పుచేసి ఆకసము అని వాడఁబడినది గాన నిది తద్భవము.

| సంస్కృతము. | తద్భవము. | సంస్కృతము. | తద్భవము |
|---|---|---|---|
| సంతోష | సంతసము | దోష | దోసము. |
| ఆశ్చర్య | అచ్చెరువు. | కుమార | కొమరుఁడు. |

తత్+భవము=తద్భవము. సంస్కృతమునుండి పుట్టినది.

సంస్కృతపదములు తద్భవపదములుగా మాఱునప్పుడు వానిలో వికార మేర్పడును. కావున వీనిని వికృతు లనియు, తత్సమపదములను ప్రకృతు లనియు నందురు. ఈ విధముగ ప్రకృతివికృతులను తత్సమతద్భవములనుగా నెఱుఁగవలెను.

సంస్కృతముతో సంబంధ మేమియు నుండక తెనుఁగు దేశములో మొదటినుండియు వాడఁబడుపదములు దేశ్యపదములు ♦

అప్ప, పెద్ద, నేను, నీవు, వాఁడు, తల్లి, తండ్రి మొదలగునవి.

మాటలాడునప్పుడు మాత్రము నుపయోగించు పదములు గ్రామ్యములు. ఉదా :—వస్తాడు, తెస్తాడు, కొడుతుంది, చేస్తున్నాను. రాస్తున్నాను, మొదలగునవి. ఇట్టి పదములు వ్యాకరణవిరుద్ధములు గావున పుస్తకములలో వ్రాయునప్పు డిట్టివాని నుపయోగింపరాదు.

— అనింద్యగ్రామ్యములు —

కొన్ని పదములు వ్యాకరణవిరుద్ధము లయినను బ్రామాణికు లైన కవులు తమగ్రంథములలోఁ బ్రయోగించినచో నట్టి వానిని అనింద్యగ్రామ్యములుగా నంగీకరింపవచ్చును.

---

♦ ఒకభాష మాటాడువారికి మఱియొకభాష మాట్లాడువారితో సంబంధము గలుగునప్పు డొకభాషలోని శబ్దములు కొన్ని మఱియొకభాషలోనికి వచ్చిచేరుచుండును. తెలుఁగుభాష కెప్పుడు సంస్కృతముతో సంబంధ ముండుటచే సంస్కృతశబ్దములు చాలవఱకుఁ దెలుఁగులోనికి వచ్చిచేరినవి. అట్లు చేరినసంస్కృతశబ్దములను గొన్నిటిని మార్పేమియుఁ జేయక వానికిఁ దెనుఁగుప్రత్యయములను మాత్రము చేర్చి వాడుకొనియున్నాము. అట్టివే తత్సమములు. కొన్నిటిని మార్పుచేసి వాడుకొనియున్నాము. అట్టివి తద్భవములు అనఁబడుచున్నవి. ఇఁకఁ దెనుఁగుభాషలో మొదటినుండియు వాడఁబడుపదములు దేశ్యములు అనఁబడును.

ఉదా :— [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], [illegible], మొ॥

ఈ ప్రయోగములలోఁ గేవల సంస్కృతపదములకు అచ్చతెలుఁగుపదములకు సమాసము చేర్పఁబడినవి. ఇట్టి సమాసములు వ్యాకరణవిరుద్ధములు; గావున గ్రామ్యములే. అయినను నివి ప్రామాణికులైన నన్నయభట్టాదికవులు ప్రయోగించినవి గావున అనింద్యగ్రామ్యములుగా లాక్షణికు లంగీకరించియున్నారు. ఇట్టి ప్రయోగములు గలవు గదా యని, మన మీసమాసములను గాని, వ్యాకరణవిరుద్ధములయిన అనేకమాటలు, అల్పదంతు మొదలగు పదములను గాని ప్రయోగింపరాదు.

తద్భవపదములును దేశ్యపదములును గలిసి 'అచ్చతెలుఁగు' అనఁబడును. గ్రామ్యపదముల గ్రంథములలో నుపయోగించుటకు వీలులేదు. గ్రంథములలో నుపయోగించు తక్కిన మూఁడువిధము లయిన వానిని రెండు విధములుగా విడఁదీయవచ్చును. 1. తత్సమపదములు. 2. అచ్చతెనుఁగుపదములు.

— అచ్చతెనుఁగులోని వర్ణములు —

అచ్చతెనుఁగులో నుండెడివర్ణములు ముప్పదియేను. వీనిలో నచ్చులు పదునాలుగు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం.

హల్లులు ఇరువదిమూఁడు.

క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ

య ర ఱ ల ళ వ స హ.

ఆంధ్రమునకు వర్ణము లేబదియా అని మన మిదివఱకుఁ దెలిసి

కొంటిమి. అనఁగా మిగిలిన పందొమ్మిదివర్ణములును తత్సమము లందే యుండు నని తెలియవలెను.

ఋ ౠ ఌ ౡ ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ థ ధ ఫ భ శ ష.

ఈ పందొమ్మిదివర్ణములు నేపదములందుఁ గనిపించునో యవి తత్సమపదములే యని నిర్ణయింపవచ్చును. ఉదా:—. ఋషి, పితౄణము, క్లృప్తము, ౡకారము, అంతఃపురము సుఖము, ఘనము, శార్ఙ్గము, ఛత్రము, ఝరి,యజ్ఞము, పాఠము గూఢము, రథము, సంబంధము, ఫలము, భయము, ఆకాశము సంతోషము మొదలగునవి.

అచ్చతెనుఁగునందుమాత్రమే యుండువర్ణము లైదు. ఎ, ఒ, చ, జ, ఱ. ఎవఁడు, మొదలు, చలి, జాము; ఱంపము. మఱియు పదములమధ్యను స్వతస్సిద్ధముగా నుండెడి ఖండబిందువుతోఁ గూడినపదము లచ్చతెలుఁగుపదములే యగును. కొలఁకు, వెలఁది, మఱఁది, వెలఁగ.

తత్సమపదములందును అచ్చతెలుఁగుపదములందును వాఁడబడువర్ణము లేఁబదియాఱు. వానిలోఁదత్సమములందు మాత్రమే యుండువర్ణములు పందొమ్మిది. అచ్చతెనుఁగునందు మాత్రమే యుండువర్ణము లైదు. ఈయిరువదినాలుగు గాక తక్కిన ముప్పదిరెండును తత్సమములందును అచ్చతెనుఁగునందును గూడ నుండును. కాఁబట్టి తత్సమములం దుండువర్ణములు మొత్తము 51. (32+19) అచ్చతెనుఁగునందలివి మొత్తము 37. (32+5).

— తత్సమపదముల గుర్తింపు గుర్తులు —

1. ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ధ ఫ ఽ భ శ ష అను సంస్కృతవర్ణములు అచ్చతెలుఁగు పదములలో నుండవు; తత్సమపదములలోనే యుండును. కావునఁ బై వర్ణము లేపదములందుఁ గనిపించునో యవి తప్పక తత్సమములే యగును.

ఋషి, ముఖము, మూషకము, వేషము మొదలగునవి.

2. అచ్చ తెలుఁగుపదములకు మొదట యకార ముండదు. తత్సమపదములకు మొదట యకార ముండవచ్చును. కావున యకారము మొదటనుండుపదములు తత్సమములే యగును.

యజ్ఞము, యాగము, యూపము మొదలగునవి.

3. అచ్చ తెలుఁగుపదములలో ననుస్వారముతరువాతఁ బరుషసరళములే యుండును.

కొలఁకు, కంచము, పంట, కోఁతి, గంప, పులుగు, గంజి, తండ్రి, చెంబు మొదలగునవి.

కావున నే పదమునందు అనుస్వారముతరువాత స్థిర వర్ణములు కనిపించునో యాపదము తత్సపదమే యని నిర్ణయింపవచ్చును.

హంస, అంశము, సంయమి, బంధువు, మాంసము.

4. ప్ర, పరా, అప, సం, అను, అవ, నిస్, నిర్, దుస్, దుర్, వి, ఆ, ని, అధి, అపి, అతి, సు, ఉత్, అభి, ప్రతి, పరి ఉప—అనునివి యేమాటలకు మొదటఁ గనఁబడునో యవి తప్పక తత్సమములే. అచ్చ తెలుఁగులు గావు. ప్రబలము,

పరాజయము, అపజయము, సంగరము, అనుజుఁడు, అవగుణము, నిస్తంద్రత, నిరాదరణము, మస్తంత్రము, దుర్గుణము, విమలము, ఆరాధనము, నివారించుట, అధికారము, అపిధానము, అతిక్రమించుట, సుగుణము, ఉత్తుంగము, అభిరామము, ప్రతిక్రియ, పరిదేవనము, అపకారము.

— పదాద్యక్షర నియమము —

మాటలకు మొదట నుండని వర్ణములు—

1, అచ్చ తెనుఁగుపదములకు మొదట యకార ముండదు. ఈమె, ఎవఁడు, ఏమి మొదలగునవి. ఈపదములను యీమె, యెవఁడు, యేమి, అని వ్రాయరాదు. 'వచ్చినయీమె' 'వెళ్ళినయామె' యనుచోటులందు సంధివలన 'య'కారము వచ్చినది. కావున మొదట ఈమె ఆమె యనియే యుండును.

తత్సమపదములకు మొదట యకార ముండవచ్చును. యుద్ధము, యజ్ఞము, యోధుఁడు, యూపము, మొదలగునవి.

2, వు,వూ,వో,వో అనునవి సాధారణముగా నేపదములకును మొదట నుండవు. ఉప్పు, ఊరు, ఒకఁడు,ఓడ మున్నగునవి. వీనిని వుప్పు, వూరు, వొకఁడు వోడ అని వ్రాయరాదు.

# పదప్రకరణము

అర్థమును దెలుపు ఒక్క వర్ణముగాని వర్ణసముదాయముగాని పద మనంబడును. అట్టిపదములనుగూర్చి తెలుపుప్రకరణము పదప్రకరణము. ఆ, శ్రీ, పో, నగ, పనస, ముఖము మొదలగునవి పదములు.

ఇట్టిపదములు వ్యస్తపదము లనియు సమాసపదము లనియు రెండువిధములు. అనేకపదములు చేరి ఏకపద మయిన దానిని సమాసపద మని యందురు. అట్లుగాక విడివిడిగా నుండుపదములను వ్యస్తపదము లనియందురు. అలరువిల్తుఁడు, రాజపురుషుఁడు మున్నగునవి సమాసపదములు, అలరు, విల్లు మున్నగునవి వ్యస్తపదములు.

శబ్దభేదములు. (Parts of Speech.)

పదములు, 1. నామవాచకములు 2. సర్వనామములు 3. విశేషణములు 4. క్రియలు 5. అవ్యయములు అని యయిదు విధములు. వీనిలో వస్తువులనామములను దెలుపువానిని నామవాచకము అని యందురు. వీనినే విశేష్యము లనియు వ్యవహరింతురు. ఇవి నాలుగువిధములు.

1. సంజ్ఞావాచకములు (Proper Nouns).
2. జాతివాచకములు (Common Nouns).
3. గుణవాచకములు (Abstract Nouns).
4. క్రియావాచకములు (Verbal Nouns).

(1) ఒక వస్తువునకే చెందవలయు నని పెట్టినపేళ్ళు సంజ్ఞావాచకనామవాచకములు—

రాముఁడు, సీత, దమయంతి, నలుఁడు, గోదావరి మొదలగునవి.

(2) ఒక జాతిలోఁ జేరినప్రతివస్తువునకును జెందునట్టి పేళ్ళు, జాతివాచకనామవాచకములు—

బాలుఁడు, మనుష్యుఁడు, చెట్టు, బాలిక, గోడ మొదలగునవి.

(3) గుణములను దెలుపుపేళ్ళు గుణవాచక నామవాచకములు—తీపి, పులుపు, నలుపు, ఎఱుపు మున్నగునవి.

తెనుఁగునఁ బ్రాతిపదికముకంటె భావార్థమున 'తనము, రికము, ఇమి, న, ఇక' మొదలగు ప్రత్యయములు చేరుచుండును. ఇట్టివిగూడ గుణవాచకము లగును. ఉదా :—

చిన్నతనము, కన్నెరికము, పేరిమి, నల్లన, అగ్గలిక.

(4) పనులపేళ్ళను దెలుపునవి క్రియావాచకనామవాచకములు. వండుట, వంట, వండమి, కొట్టుట, కొట్టమి, చేఁత, నడక—మున్నగునవి. ధాతువులకంటె 'క, ఇమి, ఁత, కువ ట, టు, పము, పు, ఇక, న, బడి, గడ, ఇకి, వు, అ, అకము, డు,' మొదలగు ప్రత్యయములు చేర్చుటచే క్రియావాచక నామవాచకము లగును.

అలుక, కలిమి, కోఁత, పెనఁకువ, ఆట, వ్రేటు, తిరిపము, చూపు, కోరిక, గడన, ఏలుబడి, తీరుగడ, వినికిఁ, మనువు, ఎండ, అమ్మకము, త్రొక్కుడు మున్నగునవి. ఇట్టివానిని భావార్థకకృదంతము లని యందురు.

## సర్వనామములు.

నామవాచకమునకు మాఱుగా వాడఁబడు శబ్దమును సర్వనామ మని యందురు. సర్వనామము మాఱుగా నిర్దేశించి చేయునది. ఈ సర్వనామము ౫ విధములు—

1. పురుషవాచకసర్వనామములు (Personal pronouns)
2. సంబంధవాచకసర్వనామములు (Relative pronouns)
3. ప్రశ్నవాచకసర్వనామములు (Interrcgative pronouns)
4. సంఖ్యావాచకసర్వనామములు (Numeral pronouns)
5. అనిర్దిష్టసర్వనామములు (Indefinite prcncuns)

(1) పురుషములను బోధించునవి పురుషవాచకసర్వనామములు.

ఉత్తమపురుషము, మధ్యమపురుషము, ప్రథమపురుషము, అని పురుషములు మూఁడు. తన్నుఁగూర్చి తెలుపునది ఉత్తమ పురుషము. ఎదుటివానినిఁగూర్చి తెలుపునది మధ్యమ పురుషము. దూరఁపువానిని గూర్చి తెలుపునది ప్రథమపురుషము. వరుసగా నీపురుషముల యేకవచన బహువచనరూపము లీక్రింద నీయఁబడినవి.

| | | |
|---|---|---|
| ఉత్తమపురుషము— | నేను | మేము |
| | ఏను | ఏము |
| మధ్యమపురుషము— | నీవు | మీరు, మీరలు |
| | ఈవు | ఈరు, ఈరలు |
| ప్రథమపురుషము— | వాఁడు | వారు, వారలు |

అతఁడు, వీఁడు, ఇతఁడు, ఎవఁడు, ఆమె, ఈమె, అది, ఇది, అవి, ఇవి మొదలగునవి.

(2) వాక్యమునందు మఱియొక సర్వనామముతో సంబంధించునదగి సంబంధవాచకసర్వనామము.

ఎవఁడు బాగుగఁ జదువునో వాఁడు పరీక్షయందు ఉత్తీర్ణుఁడగును. ఈ వాక్యమున 'ఎవఁడు' అను సర్వనామము 'వాఁడు' అను సర్వనామముతో సంబంధించియున్నది. కావున నిది సంబంధవాచకసర్వనామము.

ఇల్లాలు ఎవతె పతిభక్తి కలిగియుండునో యామెకు గౌరవము హెచ్చు. ఏది యావశ్యకమైనదో దానిని మఱచిపోకుము. ఈ వాక్యములో ఎవతె ఏది యనునవి సంబంధవాచకసర్వనామములు.

(3) ప్రశ్నించుటకుపయోగించునవి ప్రశ్నవాచకసర్వనామములు
ఎవతె నిన్నుఁ జూచెను? ఎవఁడు వచ్చెను? ఏది నీకిష్టము?
ఈ వాక్యములలో ఎవతె ఎవఁడు ఏది అనునవి ప్రశ్నవాచకసర్వనామములు.

(4) సంఖ్యను దెలుపునవి సంఖ్యావాచకసర్వనామములు.
ఒకఁడు, ఇద్దఱు, ముగ్గురు, నలుగురు రెండు మూఁడు మున్నగునవి.

(5) వాఁడు వీఁడు అనిగాని, ఇద్దఱు ముగ్గురు అనిగాని, నిర్దేశించి చెప్పనివి అనిర్దిష్టసర్వనామములు.
అన్ని, ఇన్ని, అందఱు, ఇందఱు, కొందఱు, పెక్కు, పెక్కుఱు, పలువురు మున్నగునవి.

ఈ సర్వనామములు, విశేషణములుగను విశేష్యములుగను గూడ వ్యవహరింపఁబడును. ఉదా:—

అందఱు మనుష్యులు భుజింతురు. (విశేషణము)
అందఱు దుర్జనుని దూషింతురు (విశేష్యము)

## విశేషణములు.

వస్తువులయందును పనులయందును గల విశేషమును దెలుపుమాటలు విశేషణము లనఁబడును. (Adjectives) వస్తువులయందలి విశేషములను దెలుపువానిని నామవిశేషణములని యందురు.

నల్లని గుఱ్ఱము. తెల్లని మేక. తియ్యని పండు.

పనులయందలి విశేషములను దెలుపువానిని క్రియావిశేషణము లందురు. ఉదా:—వడిగాఁ బోయెను. మెల్లఁగా నడచెను.

నామవిశేషణములు నాలుగు విధములు.

1. గుణవాచక విశేషణములు. 2. సంఖ్యావాచకవిశేషణములు. 3. సర్వనామ విశేషణములు. 4. ధాతుజవిశేషణములు.

(1) వస్తువులయందలి గుణమును దెలుపుమాటలు గుణవాచక విశేషణములు.

తెల్లని, తియ్యని, మంచి, చెడ్డ, పెద్ద.

(2) వస్తువులసంఖ్యను దెలుపునవి సంఖ్యావాచకవిశేషణములు.

(3) సర్వనామములే విశేషణములుగ వాడఁబడినచో నవి సర్వనామవిశేషణములు.

ఆమనుష్యుఁడు, ఈబాలుఁడు, ఏబాలిక.

ఈవాక్యములలో ఆ, ఈ, ఏ అనునవి సర్వనామ విశేషణములు, ఈ మూఁడిటినే తెలుఁగువ్యాకరణములందు 'త్రికము' అని వ్యవహరింతురు.

(4) ధాతువులనుండి పుట్టినవిశేషణములను ధాతుజవిశేషణము లని యందురు. *వీనినే క్రియాజన్యవిశేషణము లనియు నం దురు. ఉదా:—చదివిన, చదువుచున్న, చదువఁగల, చది వెడి, చదువని బాలుఁడు. పై రూపము లన్నియు 'చదువు' అనుధాతువునుండియే పుట్టుటచే ధాతుజవిశేషణములైనవి. ఇట్టి ధాతుజవిశేషణము లయిదువిధములు—

i. భూతార్థకధాతుజ విశేషణములు—
వచ్చిన, కొట్టిన, తినిన, తిన్న, విన్న, పోయిన, చూపించిన.

ii. వర్తమానార్థకధాతుజ విశేషణములు—
వచ్చుచున్న, పోవుచున్న, చూచుచున్న, తినిపించుచున్న.

iii. భవిష్యదర్థకధాతుజ విశేషణములు—
రాఁగల, కొట్టఁగల. తినఁగల, కొట్టింపఁగల, తినిపింపఁగల.

iv. తద్ధర్మార్థకధాతుజ విశేషణములు—
వచ్చెడి, వచ్చెడు, వచ్చు, కొట్టెడి, పోయెడు, చూపించెడి.

v. వ్యతిరేకార్థకధాతుజ విశేషణములు—
రాని, తినని, పోవని, పంపని, చూపింపని, మొదలగు నవి. ధాతుజవిశేషణముల కన్నింటికిని దరువాత 'అట్టి' అను నది వికల్పముగాఁ జేర్పఁబడును.

కొట్టుచున్నట్టి మగఁడు—కొట్టుచున్న మగఁడు.

కొట్టినట్టి బాలుఁడు—కొట్టిన బాలుఁడు.

క్రియాజన్యవిశేషణములకుఁగాక, కొన్ని విశేషణములకు ఒక ప్పుడు 'అయిన, ఐన, అగు, ఔ' అనునవి వికల్పముగఁ జేరు చుండును. నిగ్గయిన, నిగ్గైన, నిగ్గగు, నిగ్గౌ, చెక్కులు, నిగ్గు చెక్కులు.

### క్రియలు.

పనులను తెలుపుమాటలను 'క్రియ' లందురు. ప్రత్యయములు చేరకముందు క్రియలను 'ధాతువు' లని యందురు. ధాతువు లన్నిటికిని చివర 'ఉకార' ముండును. చేయు, వండు, వ్రాయు, సడిలించు, కలిగించు.

### ౧. తత్సమములు—అచ్చికములు.

ఇట్టి ధాతువులు తత్సమములు అచ్చికములు అని రెండు విధములు. కొన్ని సంస్కృతశబ్దములపై 'ఇంచు' చేరుటవలన నేర్పడునవి తత్సమములు.

పోషించు, సంతోషించు, భుజించు, రచించు.

కొన్ని సంస్కృతశబ్దములపై 'ఇల్లు' చేర్చుటవలన నేర్పడునవి. భాసిల్లు, రంజిల్లు, వర్ధిల్లు, విలసిల్లు.

దేశ్యములు తద్భవములు నగుధాతువులు అచ్చికములు. ఉండు, పోవు, తిను, పలుకు, ఉలుకు, మెలఁగు, పరగు.

### ౨. సకర్మకములు—అకర్మకములు.

పై రెండువిధములయిన ధాతువులు సకర్మకములు, అకర్మకములు అని రెండు విధములు. కర్మము నాకాంక్షించునవి సకర్మకములు. అనఁగా నే వాక్యమునందుఁ గ్రియనుబట్టి దేనిని వేనిని అనుప్రశ్న ముండునో యట్టివి. బాలుఁడు పండును దినెను. ఈ వాక్యమున బాలుఁడు దేనిని దినెను? అను ప్రశ్నమునకు, 'పండును' అను సమాధానము వచ్చుచున్నది. కావున 'తిను' ధాతువు సకర్మకము. కర్మము నాకాంక్షింపనివి అకర్మకములు, అనఁగా నేవాక్యమునఁ గ్రియనుబట్టి దేనిని వేనిని అనుప్రశ్న ముండదో యట్టివి.

బాలుఁడు నిద్రించెను. ఈ వాక్యమున దేనిని వేనిని అను ప్రశ్నము లేదు. కావునఁ 'నిద్రించు' అను ధాతువు అకర్మకము.

కొన్ని క్రియలకు రెండుకర్మ లుండును. అట్టివానిని ద్వికర్మకము లని యందురు.

గొల్లవాఁడు మేఁకను గొల్లపల్లెకు జేర్చెను.

3. స్వార్థకములు – ప్రేరణార్థకములు

పై ధాతువు లన్నియు స్వార్థకములు ప్రేరణార్థకములు అని మరల రెండు విధములు.

పనినిమాత్రము తెలుపునవి స్వార్థకములు.

భుజించు, నిద్రించు, చేయు, తిను, వండు, పరుగెత్తు.

పనిచేయుటకై యొకనిని ప్రేరేపించుటను దెల్పునవి ప్రేరణార్థకములు.

భుజింపించు, నిద్రింపించు, చేయించు, తినిపించు, వండించు, పరుగెత్తించు.

ప్రేరణార్థకమునఁ గొన్ని ధాతువులకు 'ఇంచు,' కొన్నిటికి 'చు' కొన్నిటికి 'పు' వచ్చును. కొన్నిటి కిందు రెండేసి మూఁడేసి వచ్చును.

| స్వార్థకములు. | ప్రేరణార్థకములు. | స్వార్థకములు. | ప్రేరణార్థకములు. |
|---|---|---|---|
| ఇంచు—చదువు | చదివించు | చు—విఱుగు | విఱుచు |
| నవ్వు | నవ్వించు | మునుఁగు | ముంచు |
| చెప్పు | చెప్పించు | పు—చూచు | చూపు |
| నగించు | నగియించు | నేరుచు | నేరుపు |
| పంపు | పంపించు | మేయు | మేపు |
| భుజించు | భుజింపించు | రేఁచు | రేఁపు |

ఇంచు, చు—పూను—పూనించు, పూనుచు

తేలు—తేలించు, తేలుచు

విను—వినిపించు, వినుచు

చు, పు— మను—మనుచు, మనుపు

పాయు—పాచు, పాపు

చినుగు—చించు, చింపు

ఇంచు, పు— మాయు—మాయించు, మాపు

ఇంచు, చు, పు—ఆఁగు—ఆఁగించు, ఆఁచు, ఆఁపు

రేఁగు—రేఁగించు, రేఁచు, రేపు

మాను—మానిపించు, మానుచు, మానుపు

ఈ 'ఇంచు, చు, పు' అనునవి చేరునపుడు ప్రయోగములలోఁ గొన్ని విశేషములు గానఁబడును.

అగు—కావించు    చెడు—చెఱుచు, చెఱుపు
కొను—కొలుపు    చొచ్చు—చొనుపు, చొప్పించు
వచ్చు—రావించు, రప్పించు    తిరుగు—త్రిప్పు
నొచ్చు—నొంచు, నొప్పించు    చచ్చు—చంపు
ఉండు—ఉనుచు, ఉంచు    నిలుచు—నిలువరించు, నిలుచు
పోవు—పుచ్చు, పనుచు, పంచు, పనుపు, పంపు, అనుచు, అంచు, అంపు
ఓడు—ఓరుచు, ఓడించు
వెలువడు—వెలువఱుచు, వెలువరించు.

### ౮. కర్త్రర్థకములు—కర్మార్థకములు.

ఏ వాక్యమునందు క్రియచేఁ గర్త చెప్పఁబడునో యా వాక్యమునందలి ధాతువు 'కర్త్రర్థకము' అనఁబడును.

కృష్ణుఁడు కంసుని జంపెను. ఎవఁడు చంపెను అను ప్రశ్నమునకు 'కృష్ణుఁడు' అనునది ప్రత్యుత్తరము. కావున, నిచటి క్రియ కర్తను జెప్పును; గాన 'చంపు' అను ధాతువు కర్త్రర్థకము. ఇట్టి వాక్యములను కర్త్రర్థకవాక్యము లనియు నందురు.

ఏ వాక్యమునఁ గ్రియచేఁ గర్మ చెప్పఁబడునో, అందలి ధాతువు 'కర్మార్థకము' అనఁబడును.

కృష్ణునిచేఁ గంసుఁడు చంపఁబడెను.

ఎవఁడు చంపఁబడెను ? అను ప్రశ్నమునకు 'కంసుఁడు' అను కర్మ ప్రత్యుత్తర మగుటచే నిచటి క్రియ కర్మను జెప్పును. కావున 'చంపు' అను ధాతువు కర్మార్థకము. ఇట్టి వాక్యములను కర్మార్థకప్రయోగము లనియు నందురు.

అకర్మకధాతువులకు కర్మార్థక ముండదు.

కృష్ణుఁడు మధురకుఁ బోయెను. 'పోవు' అను ధాతువు అకర్మకము కావున దీనికిఁ గర్మార్థకప్రయోగ ముండదు. "కృష్ణునిచే మధుర పోఁబడెను" అను ప్రయోగ ముండదు గదా !

కర్త్రర్థకధాతువు యొక్క తుమున్నంతరూపమునకు 'పడు' అనుదానిని జేర్చినచో కర్మార్థక మగును.

చంపు—చంపఁబడు. తిను—తినఁబడు.

### ౫. ఆత్మనేపదార్థకము

క్రియాఫలము ఆత్మను (కర్తను) జెందునేని యట్టిధాతువు 'ఆత్మనేపదార్థకము' అనఁబడును.

ఆత్మనేపదార్థమునందు ధాతువునకుఁ జివర 'కొను' అనునది చేర్పఁబడును. వండుకొనుచున్నాఁడు. ఇందు వంటక ము చేయువానికే ఫలించు నని యర్థము. ఇట్లే వ్రాసికొను చున్నాఁడు. చదువుకొనుచున్నాఁడు.

కొను ధాతువు పరమగునపుడు యకారాంతధాతువులకు నిత్యముగను, ఇతరములకు వికల్పముగను 'ఇ' వచ్చును.

వండుకొనుచున్నాఁడు, వండికొనుచున్నాఁడు.

కొట్టుకొనుచున్నాఁడు, కొట్టికొనుచున్నాఁడు.

ఇకారము పరమగునపుడు ధాతువునందలి యకారమునకు సకారము వచ్చును.

చేయు+కొనియె—చేయు+ఇ+కొనియె=చేసికొనియె.

ఇట్లే మూసికొనియె, వ్రాసికొనియె, వేసికొనియె.

అకర్మకధాతువులకు ఆత్మనేపదార్థక ముండదు. 'పరుగెత్తుకొనియె, నిద్రించుకొనియె' అని యుండదుగదా. పై ధాతువు లన్నిటినుండియు సమాపకములు అసమాపకములు నగు క్రియలు పుట్టును.

పోషించు-పోషించెను, పోషించి; తిను- తినెను, తిని; నిద్రించు- నిద్రించెను, నిద్రించి; తినిపించు- తినిపించెను, తిని పించి; చంపు- చంపెను, చంపి, చంపఁబడు- చంపఁబడెను, చంపఁ బడి; వండుకొను, వండుకొనె- వండుకొని.

## సమాపకక్రియలు

వాక్యమును ముగించునది 'సమాపకక్రియ' లనఁబడును. రాముఁడు నిన్న వచ్చెను. నే నింటిలో నుంటిని.

సమాపకక్రియ లెలిమిది విధములు—

1. వర్తమానార్థకములు
2. భూతార్థకములు
3. భవిష్యదర్థకములు
4. తద్ధర్మార్థకములు
5. వ్యతిరేకార్థకములు
6. ఆశీరాద్యర్థకములు
7. ప్రార్థనాద్యర్థకములు
8. వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములు.

ధాతువునకు ప్రథమ మధ్యమో త్తమపురుషములలో నీ క్రింది ప్రత్యయములు వచ్చును.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్రథమపురుషము | డు | రు |
| మధ్యమపురుషము | వు | రు |
| ఉత్తమపురుషము | ను | ము |

అమహదర్థమున ప్రథమపురుషమునందు 'దు,వు'లగును. 'ఉన్న'అను అనుబంధముమీఁద నవి'ది,వి'లుగా మాఱును. మహత్త్వర్థమున ఏకవచనము అమహత్తువలెను, బహువచనము మహత్తువలెను అగును.

(1) జరుగుచున్నపనిని దెలుపుక్రియ వర్తమానార్థకము— వర్తమానకాలమున క్రియకు 'ఉన్న' యనునది అనుబంధముగా వచ్చును. దీనికి ముందు 'చు' అనునది ఆగమముగా వచ్చును. వండు+చు+ఉన్న=వండుచున్న. ది, వి, అను ప్రత్యయములు తప్ప మిగిలినప్రత్యయములు పరమగు నపుడు 'ఉన్న' అనునది దీర్ఘాంత మగును.

ఆత్మనేపదార్థమునందు ధాతువునకుఁ జివర 'కొను' అనునది చేర్పఁబడును. వండుకొనుచున్నాఁడు. ఇందు వంటకము చేయునాతఁడే భుజించు నని యర్థము. ఇట్లే వ్రాసికొనుచున్నాఁడు. చదువుకొనుచున్నాఁడు.

కొనుధాతువు పరమగునపుడు యకారాంతధాతువులకు నిత్యముగను, ఇతరములకు వికల్పముగను 'ఇ' వచ్చును.

వండుకొనుచున్నాఁడు, వండికొనుచున్నాఁడు.

కొట్టుకొనుచున్నాఁడు, కొట్టికొనుచున్నాఁడు.

ఇకారము పరమగునపుడు ధాతువునందలి యకారమునకు సకారము వచ్చును.

చేయు+కొనియె—చేయు+ఇ+కొనియె=చేసికొనియె.

ఇట్లే మూసికొనియె, వ్రాసికొనియె, వేసికొనియె.

అకర్మకధాతువులకు ఆత్మనేపదార్థక ముండదు. 'పరుగెత్తుకొనియె, నిద్రించుకొనియె' అని యుండదుగదా. పై ధాతువు లన్నిటినుండియు సమాపకములు అసమాపకములు నగు క్రియలు పుట్టును.

పోషించు-పోషించెను, పోషించి; తిను- తినెను, తిని; నిద్రించు- నిద్రించెను, నిద్రించి; తినిపించు- తినిపించెను, తినిపించి; చంపు- చంపెను, చంపి, చంపఁబడు- చంపఁబడెను, చంపఁబడి; వండుకొను, వండుకొనె- వండుకొని.

### సమాపకక్రియలు

వాక్యమును ముగించునవి 'సమాపకక్రియ' లనఁబడును. రాముఁడు నిన్న వచ్చెను. నే నింటిలో నుంటిని.

సమాపకక్రియ లెనిమిది విధములు—

1. వర్తమానార్థకములు
2. భూతార్థకములు
3. భవిష్యదర్థకములు
4. తద్ధర్మార్థకములు
5. వ్యతిరేకార్థకములు
6. ఆశీరాద్యర్థకములు
7. ప్రార్థనాద్యర్థకములు
8. వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములు,

ధాతువునకు ప్రథమ మధ్యమోత్తమపురుషములలో నీ క్రింది ప్రత్యయములు వచ్చును.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్రథమపురుషము | డు | రు |
| మధ్యమపురుషము | వు | రు |
| ఉత్తమపురుషము | ను | ము |

అమహదర్థమున ప్రథమపురుషమునందు 'దు,వు'లగును. 'ఉన్న'అను అనుబంధముమీఁద నవి'ది,వి'లుగా మాఱును-మహత్యర్థమున ఏకవచనము అమహత్తువలెను, బహువచనము మహత్తువలెను అగును.

(1) జరుగుచున్నపనిని దెలుపుక్రియ వర్తమానార్థకము— వర్తమానకాలమున క్రియకు 'ఉన్న' యనునది అనుబంధముగా వచ్చును. దీనికి ముందు 'చు' అనునది ఆగమముగా వచ్చును. వందు+చు+ఉన్న=వందుచున్న. ది, వి, అను ప్రత్యయములు తప్ప మిగిలినప్రత్యయములు పరమగునపుడు 'ఉన్న' అనునది దీర్ఘాంత మగును.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. (మహ) | చదువుచున్నాడు | చదువుచున్నారు |
| (అమహ) | చదువుచున్నది | చదువుచున్నవి |
| మ. పు. | చదువుచున్నావు | చదువుచున్నారు |
| ఉ. పు. | చదువుచున్నాను | చదువుచున్నాము |

(2) జరిగిపోయిన పనిని దెలుపునది భూతార్థకము—
భూతకాలమున ధాతువున కేకవచనమునందు 'ఎను' ప్రత్యయ మగును. అమహద్వాచక బహువచనమునఁ గూడ నిదియే వచ్చును. మఱియు ధాతువు తుది నున్న ఉకారమునకు ఇకార మగును. వు, ను, రు, ము, అను ప్రత్యయములు పరమగునపుడు ధాతువునకు 'తి' వర్ణకము వచ్చును. ఇకారము మీఁది వు, ను, రు, ము, ల ఉకారమునకు ఇకార మగును.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. | చదివెను | చదివిరి |
| మ. పు. | చదివితివి | చదివితిరి |
| ఉ. పు. | చదివితిని | చదివితిమి |

మధ్యమపురుషమందలి వకారము వికల్పముగ లోపించును.
చదివితివి—చదివితి, చదివితి+ఇ=చదివితి.

(3) జరుగ నున్న పనిని దెలుపునది భవిష్యదర్థకము—
భవిష్యదర్థకమున ధాతువునకు 'కల' అనునది అనుబంధముగా నగునప్పు అగుచో 'ను' ఆగమమును, ధాతువు తుది

ఉకారమునకు అకారమును వచ్చును. చదువు + కల= చదువ+ను+కల=చదువఁగల

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. | చదువఁగలఁడు | చదువఁగలరు |
| మ. పు. | చదువఁగలవు | చదువఁగలరు |
| ఉ. పు. | చదువఁగలను | చదువఁగలము |

వ్యవహారములో మాత్ర మీరూపములు భవిష్యదర్థమున వాడఁబడక, శక్తిసూచకముగ వాడఁబడుచున్నవి. చదువఁగలను=చదువుటకు నాకు శక్తి గలదు అని యర్థము.

(4) మీఁది మూఁడుకాలములకంటె వేఱై ఆమూఁడుకాలములందును జరుగు పనిని దెలుపునది తద్ధర్మార్థకము.

భూమి తిరుగును. పక్షులు ఎగురును.

తద్ధర్మార్థకమునందు ప్రథమపురుషైకవచనమునను; అమహద్వాచక ఏకవచన బహువచనములందును 'ను, ఎడుఁ, ఎడిఁ' అను ప్రత్యయములు వచ్చును. మిగిలినచోట్ల 'దు, ఎద' అనునవి ఆగమముగను వచ్చును.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. (మహ) | చదువును | చదువుదురు |
| (అమ) | చదువును | చదువును |
| మ. పు. | చదువుదువు | చదువుదురు |
| ఉ. పు. | చదువుదును | చదువుదుము |

## రూపాంతరము.

ప్ర. పు. (మహ) చదివెడుఁ, చదివెడిఁ—చదివెదరు, చదువుదురు

(అమహ) చదివెడుఁ, చదివెడిఁ—చదివెడుఁ, చదివెడిఁ

మ. పు. చదివెదవు, చదువుదువు—చదివెదరు, చదువుదురు

ఉ. పు. చదివెదను, చదువుదును—చదివెదము, చదువుదుము

తద్ధర్మార్థక మధ్యమపురుషము నందలి వకారము వికల్పముగ లోపించును.

చదువుదువు—చదువుదు. చదువుదు+ఉ=చదువుదు.

చదివెదవు—చదివెదు. చదివెద+ఉ—చదివెదు.

ఇప్పటివ్యవహారములో నీతద్ధర్మార్థకక్రియ భవిష్యదర్థమున వాడఁబడుచున్నది. ఉదా:—నేను రేపు చదువుదును.

(5) వ్యతిరేకార్థకము—పని జరుగనట్లు తెలుపుక్రియలు వ్యతిరేకార్థకములు. ఈ క్రియలు మూఁడుకాలములకు సంబంధించి యుండును. అన్ని పురుషములలోను ధాతువునకుఁ జివర 'అకారము' చేరును.

| | ఏక | బహు | ఏక | బహు |
|---|---|---|---|---|
| ప్ర. పు. (మహ) | అఁడు | అరు | చదువఁడు | చదువరు |
| (మహతి) | అదు | అరు | చదువదు | చదువరు |
| (అమహ) | అదు | అవు | చదువదు | చదువవు |
| మ. పు. | అవు | అరు | చదువవు | చదువరు |
| ఉ. పు. | అను | అము | చదువను | చదువము |

ఇట్లే చేయఁడు, వండఁడు, కొట్టింపఁడు మొదలగునవి.

(6) ఆశీరాద్యర్థకములు—దీవించుట శపించుట మున్నగు నర్థముల నిచ్చుక్రియలు ఆశీరాద్యర్థకములు. ఈయర్థమున ధాతువునకు ఎడున్, తన్, అనుప్రత్యయము లన్నిపురుషలందును వచ్చును.

ఆశీస్సు—నీకు ధనము కలిగెడున్, మీకు ధనము కలుగుతన్.

శాపము—నీకు నరక మయ్యెడున్, మీకు నరక మగుతన్.

తద్ధర్మార్థక క్రియలకు తుదిని 'కాక, కాతన్, కావుతన్' అనువానిని జేర్చి ఆశీరాద్యర్థములందు వాడుదురు.

కలుగుఁగాక, కలుగుఁగాతన్, కలుగుఁగావుతన్,

అగుఁగాక, అగుఁగాతన్, అగుఁగావుతన్.

'ఎడు, త' ల ద్రుతమునకు, అచ్చు పరమగునపుడు మకారము ఆదేశముగ వచ్చును.

కలిగెడున్+అనియె=కలిగెడు మనియె.

కలుగుతన్+అనియె=కలుగుత మనియె.

(7) ప్రార్థనాద్యర్థకములు—ఒక పని చేయు మని ప్రార్థించుట అడుగుట ఆజ్ఞాపించుట అను వీనిని దెలుపునట్టిక్రియలు ప్రార్థనాద్యర్థకములు. ఈయర్థములందు ధాతువునకు ఏకవచనమున 'ము' బహువచనమున 'డు' వచ్చును.

ప్రార్థనము—నన్ను రక్షింపుము. నన్ను రక్షింపుఁడు.

అడుగుట—మిత్రుఁడా! నాతో రమ్ము. మిత్రులారా! నాతో రండు.

ఆజ్ఞాపించుట—పుస్తకము చదువుము, పుస్తకము చదువుఁడు.

ఈక్రియలను ఆశీశ్శ్యాపాద్యర్థములందురు వాడుదురు.

ఉదా:—ధనవంతుఁడ వగుదువు. దరిద్రుల రగుఁదురు,

విధ్యర్థమున 'ఎదు, త' అనువానికి మాఱుగ ప్రత్యయ పూర్వక మయిన 'అది' యగును.

నీవు వచ్చునది, వ్రాయునది, చేయునది మొదలగునవి.

8. వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములు—పని చేయవలదని ప్రార్థించుటను అడుగుటను ఆజ్ఞాపించుటను దెలుపునట్టి క్రియలు వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములు. వ్యతిరేక ప్రార్థనాద్యర్థంబున వచ్చు 'ము, డు' లకు ముందు 'కు' అగును. అగుచో ధాతువు తుదినున్న ఉకారమునకు అకారము వచ్చును. చేయకుము—చేయకుఁడు. తప్పకుము—తప్పకుఁడు. మన మెల్లపుడు ఎదుటివానినే ప్రార్థింతుము, అడుగుదుము, ఆజ్ఞాపింతుము. కావున ప్రార్థనాద్యర్థకములకు వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములకు మధ్యపురుషమే కాని యితర పురుషము లుండవు.

పై క్రియ లన్నిటియందలి ఉత్తమపురుషైకవచనంబులు, భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనంబులు, ఆశీశ్శ్యాపాద్యర్థకములయిన 'ఎదు, త' లును, ప్రత్యయ ప్రకృతికములు. మిగిలిన వన్నియు వికృతులు.

## అసమాపక క్రియలు.

వాక్యమును సమాప్తి చేయలేనట్టి క్రియలు అసమాపక క్రియలు. ఇవి పది విధములు.

1. క్త్వార్థకము. 2. వ్యతిరేకక్త్వార్థకము. 3. తుమున్నర్థకము
4. చేదర్థకము. 5. ఆనంతర్యార్థకము. 6. శత్రర్థకము.

(1) ధాతువునకుఁ జివర 'ఇ' వచ్చినచో క్త్వార్థక మగును.
చదువు+ఇ=చదివి. చదువుట అనుపని చేసి యనియర్థము.
బాలుఁడు చదివి పరుగెత్తెను. ఇట్లే విని, చెప్పి చేయించి.

(2) ధాతువునకు 'అక' చేర్చినచో వ్యతిరేకక్త్వార్థక మగును.
చదువు+అక=చదువక, చదువుట యనుపని చేయక యని యర్థము. నేను బడిలోఁ జదువక వెడలిపోయితిని. ఇట్లే-తిట్టక, నవ్వక, వినిపింపక, చెప్పింపక మొదలగునవి.

(3) ధాతువునకు 'అన్' చేర్చినచో తుమున్నర్థక మగును.
చదువు+అన్=చదువన్=చదువుట యను పని చేయుటకై.
గురువు నన్నుఁ జదువ నాజ్ఞాపించెను.
ఇట్లే—పలుకన్, వినన్, అనన్, పలికింపన్ మొదలగునవి.
దీనికిఁ జివర నొకప్పుడు 'కన్' 'కాన్' అనునవి చేరుచుండును. చదువఁగన్, చదువఁగాన్. వినఁగన్, వినఁగాన్.

(4) ధాతువునకు 'ఇనన్' చేర్చినచో చేదర్థక మగును.
చదువు+ఇనన్=చదివినన్=చదువుట యనుపని చేసినయెడల.
నీవు చదివిన నేను జెప్పెదను. ఇట్లే చేసిన, వినిన, వినిపించిన.

(5) ధాతువునకు 'డున్' చేర్చినచో ఆనంతర్యార్థకమగును.
చదువు+డున్=చదువుడున్=చదివిన వెంటనే యని యర్థము.
వాఁడు చదువుడున్ నేను వచ్చితిని.
ఆనంతర్యార్థమున నొకప్పుడు తుమున్నర్థకము చేదర్థకము

కూడ వాడఁబడును. నా శిష్యు చెప్పఁగన్, చెప్పఁగ విని యాశ్చర్యపడితిని. చెప్పఁగ=చెప్పఁగనెంటనే యని యర్థము.

(6) ధాతువునకు 'చున్' చేర్చినచో శత్రర్థక మగును.

చదువు+చున్=చదువుచున్. చదువుట యను పని చేయుచు.

గురువు మంత్రములు చదువుచు దీవించెను.

ఇట్లే—తినుచున్, వినుచున్, చదివించుచున్ మొదలగునవి.

పై యాఱువిధములయిన అసమాపకక్రియలలో క్త్వార్థకమును వ్యతిరేకక్త్వార్థకమును గళలు. మిగిలిన వన్నియు ద్రుతప్రకృతికములు.

ధాతువులనుండి పుట్టిన విశేష్యములు * :—

ఇవి రెండు విధములు—(1) భావార్థకము. (2) వ్యతిరేక భావార్థకము. ధాతువునకు 'ట' చేర్చిన భావార్థక మగును.

వండుట, వినుట, తినుట.

ధాతువునకు 'అమి' చేర్చిన వ్యతిరేకభావార్థక మగును.

వండమి, వినమి, చదువమి, చేయింపమి.

ధాతువులనుండి పుట్టిన విశేషణములు * — వెనుకఁ దెలిపిన యయిదువిధములయిన ధాతుజవిశేషణములు.

చదివిన, చదువుచున్న, చదువఁగల, చదివెడి, చదువని.

---

* ఈ విశేష్యములను అసమాపకక్రియలలో భేదములుగఁ దెలుపుట సమంజసముగఁ గానరాదు. ఇవి ధాతువులనుండి బయలుదేఱు నామవాచకములే యగును [illegible] క్రియలు [illegible] 19.

ఇవి ధాతుజవిశేషణములే యగును గాని క్రియలు గావు; గాన [illegible]

క్రియాపదములలోని పత్వవత్వాది కార్యములు.

సమాపకక్రియలలోని భవిష్యదర్థకము, వ్యతిరేకార్థకము, ప్రార్థనాద్యర్థకము, వ్యతిరేకప్రార్థనాద్యర్థకమును, అసమాపక క్రియలలో వ్యతిరేకక్త్వార్థకము, తుమున్నర్థకమును, ధాతువుల నుండి పుట్టిన విశేష్యములలో వ్యతిరేకభావార్థకమును, ధాతుజ విశేషణములలో వ్యతిరేకధాతుజవిశేషణములును 'ముత్తులు' అనఁబడును.

1. ముత్తులలోఁ గొన్ని ధాతువుల చివర నున్న 'చు' అను దానిలోని చకారమునకు పకారమును, కొన్నింటిచివరనున్న 'చు' అనుదానిలోని చకారమునకు వకారమును వచ్చును.
   నిద్రించు—నిద్రింపఁగలఁడు, నిద్రింపఁడు, నిద్రింపుము, నిద్రింపకుము, నిద్రింపక, నిద్రింపన్, నిద్రింపమి, నిద్రింపని.
   ఇట్లే—భుజించు, ముంచు, నగియించు, వినిపించు.
   పిలుచు—పిలువఁగలఁడు, పిలువఁడు, పిలువుము, పిలవకుము, పిలువక, పిలువన్, పిలువమి, పిలువని.
   ఇట్లే—మఱచు, కఱచు, పఱచు, లేచు.

ఇందు లేచునకు ప్రార్థనాద్యర్థకమున 'చు' లోపించును.
   లెమ్ము, లెండు.

2. ముత్తులలో వచ్చు, చొచ్చు, చూచు లకు, 'రా, చొరు, చూడు' అనునవి వచ్చును.
   వచ్చు—రాఁగలఁడు, రాక, రామి, రాని.
   చొచ్చు—చొరఁడు, చొరన్, చొరమి, చొరని.
   చూచు—చూడుము, చూడకుము, చూడమి, చూడని.

3. ముత్తులలో 'ఇచ్చు' నకు 'ఈ, ఈయ' యగును.
ఇచ్చు—ఈఁగలఁడు, ఈయఁగలఁడు; ఈక, ఈయక; ఈమి, ఈయమి; ఈని, ఈయని.

4. ముత్తులలో 'తెచ్చు' నకు 'తే, తేరు' లగును.
తెచ్చు—తేఁడు, తేరఁడు; తేక, తేరక; తేమి, తేరమి; తేని, తేరని.

5. ముత్తులలో 'చచ్చు, నొచ్చు' లకు, 'చావు, నోవు' లగును.
చచ్చు—చావఁడు, చావక, చావమి, చావని.
నొచ్చు—నోవఁడు, నోవుము, నోవక, నోవమి, నోవని.

6. ముత్తులలో 'అగు' నకు ప్రార్థనాద్యర్థకమున వికల్పముగాను, మిగిలినవానిలో నిత్యముగాను 'కా' వచ్చును.
అగు—అగుము, కమ్ము; అగుఁడు, కండు; కాఁ గలఁడు, కాక, కాని, కామి.

7. ప్రార్థనాద్యర్థకము తప్పఁ దక్కిన ముత్తులలో 'అను, కను' లకు 'నా, కాన'లు వికల్పముగా నగును.
అను—నాఁగలఁడు, అనఁగలడు; నాక, అనక, నాన్, అనక;
కను—కానఁడు, కనఁడు; కానక, కనక; కానమి, కనమి, కానని, కనని.
ప్రార్థనాద్యర్థకములో, అనుము, అనుఁడు; కనుము, కనుఁడు.

8. ముత్తులలో 'పోవు' నకు 'వు' లోపము వికల్పముగానగును.
పోవు—పోఁగలడు, పోవఁగలడు; పోక, పోవక; పోమి, పోవమి; పోని, పోవని.

## అవ్యయములు.

లింగము విభక్తి వచనము లేనివి అవ్యయములు. ఇవి లాక్షణికములు ప్రతిపదోక్తములు అని రెండువిధములు. లాక్షణికము లనఁగా లక్షణముచే (శాస్త్రముచే) నిష్పన్నములైనవి. క్రియలనుండి పుట్టినక్త్వార్థకములు, వ్యతిరేకక్త్వార్థకములు, తుమున్నర్థకములు, శత్రర్థకములు, అనంతర్యార్థకములు, చేదాద్యర్థకములు, అగుధాతువు తుమున్నంతరూపము లయిన 'కన్, గాన్' అనునవి చివరఁగలవియును (మెల్లఁగన్, మెల్లఁగాన్) లాక్షణికములైన యవ్యయములు. చదివి, చదువక, చదువన్, చదువుచున్, చదువుదున్, చదివినన్.

సముచ్చయార్థకములగు 'ను' 'యును' అంతమందు గలవి. పదముల నొండొంటితోఁ గలుపునవి సముచ్చయములు. వీనిలో ఉకారాంత పదములమీఁద 'ను' అనునదియును మిగిలిన పదములమీఁద 'యును' అనునదియును వచ్చుచుండును. ఉదా:—శ్రీకృష్ణుఁడును, సత్యభామయును, శౌరియును ద్వారకకు వచ్చిరి.

అవ్యయము లని ప్రత్యేకముగఁ జెప్పఁబడినవి ప్రతిపదోక్తములైన అవ్యయములు. ఉదా:—

అంత, అఁట, అకట, అదిగో, అద్దిర, అమ్మకచెల్ల, అయ్యారె, అవుర, ఆహా, ఇఁక, ఇదిగో, ఇంచుక, ఇసీ, ఊరక, ఉద్దవిడి, ఎంత, ఎట్టూ, ఎప్పటి, ఎల్ల, ఏల, ఒండె, ఒకో, ఓయి, ఓహో, కటకట, కట్టా, కడు, కద, కనుక, కరము, కాని,

కాఁబట్టి, కాఁబోలు, కావున, కొంత, క్రమ్మఱ, గ్రక్కున, ఛీ, చెల్లఁబో, చేరి, తప్పయు, తరుమిడి, తరువాత, దనుక, దాఁక, నెట్టె, పదపడి, పిదప, పిమ్మట, ఓహో, ఔరా, బాపు, బాపురే, మఱి, మజ్జె, మిక్కిలి, మిన్నక, వెండి, వెండియు, హా, హాహాహూహూలు, హాహాహూహూ, మొదలగునవి.

### లింగములు — మహదమహన్మహతీవాచకములు.

తెనుఁగుభాషలోని శబ్దములను మహద్వాచకములు మహతీవాచకములు అమహద్వాచకములు అని మూఁడు విధములుగ విభజించియున్నారు.

మనుష్యులలోఁగాని దేవతలలోఁగాని పురుషులను బోధించుశబ్దములును వానివిశేషణములును మహద్వాచకములు.

ఉదా :— రాముఁడు, కృష్ణుఁడు, ఇంద్రుఁడు, తండ్రి, కొడుకు, ఉత్తముఁడు, నీచుఁడు.

స్త్రీలను బోధించుశబ్దములును వాని విశేషణములును మహతీవాచకములు. ఉదా:— సీత, శకుంతల, సరస్వతి, తల్లి కుమారి, నీచురాలు, ఉత్తమురాలు, గుణవంతురాలు, సుందరి.

పశుపక్ష్యాదివాచకములును, జడవాచకములును, వాని విశేషణములును అమహద్వాచకములు. ఉదా:— ఆవు, కుక్క, కాకి, పాము, చెట్టు, వనము, ఇల్లు, ఉత్తమము, నీచము.

పైమూఁడువిధము లైనశబ్దములను వరుసగా పుంలింగము స్త్రీలింగము నపుంసకలింగము అని కొందఱు వ్యవహరింతురు. కాని యది సరికాదు. ఈసంజ్ఞలు సంస్కృతవ్యాక

రణమునకు సంబంధించినవి. సంస్కృతభాషలో లింగము శబ్ద
మునుబట్టి యుండునేగాని యర్థమును బట్టి యుండదు. అనఁగా
పురుషులను బోధించునవి పుంలింగములే యని చెప్పుటకు వీలు
లేదు. స్త్రీలింగములు నపుంసకలింగములుకూడఁ గావచ్చును.
ఉదా:— దేవత=స్త్రీలింగము. మిత్త్రము=నపుంసకలింగము.
స్త్రీలను దెలుపున వన్నియు స్త్రీలింగములే యని చెప్పుటకు
వీలులేదు. పుంలింగములును నపుంసకలింగములును గూడఁ
గావచ్చును. ఉదా :—దార=(భార్య)=పుంలింగము. కళ
త్రము=(భార్య)=నపుంసకలింగము. ఇతరము లన్నియు నపుం
సకలింగములే యని చెప్పుటకు వీలులేదు. పుంలింగములు
స్త్రీలింగములును గావచ్చును. ఉదా :—వృక్షము=పుంలిం
గము. శిల=(రాయి)=స్త్రీలింగము.

ఆంధ్రభాషలో సంస్కృతమునందువలెఁ గాక యాంగ్ల
ములోవలె నర్థమును బట్టియే యీభేదము గుర్తింపవలెను.
కనుక నాంధ్రభాషలో మహద్వాచకము, మహతీవాచకము
అమహద్వాచకము అని వ్యవహరింపవలెనే గాని పుంలింగము
స్త్రీలింగము నపుంసకలింగము అని వ్యవహరింపరాదు.

అకారాంతములై పుంలింగములైన మహద్వాచకము
లకు 'డు' వచ్చును. ఉదా:—రాముఁడు, కృష్ణుఁడు, బాలుఁడు
వీరుఁడు.

అకారాంతములైన నపుంసకలింగములకును, అకారాం
తములైన అమహద్వాచకములకును 'ము' వచ్చును. మిత్త్రము,
కళత్రము, వనము, వృక్షము.

ఇకారాంతశబ్దముల కేదియు రాదు.

హరి, మతి, గౌరి, లక్ష్మి, శ్రీ.

ఉకారాంతశబ్దములకు 'వు' వచ్చును.

విష్ణువు, ధేనువు, మధువు, భ్రూవు.

ఈనియమములు తత్సమశబ్దములకే సంబంధించును.

ఇఁక దాచ్ఛికశబ్దములు కొన్ని పుంలింగసమములును, కొన్ని స్త్రీలింగసమములును, కొన్ని నపుంసకలింగసమములు నై యుండును. పుంలింగసమములకు 'ఁడు' వచ్చును.

మగఁడు, మనుమఁడు, కయిఁరదు, కత్తళఁడు, గిజిగాఁడు.

నపుంసకసమములకు 'ము' వచ్చును.

అంకము, చందము, అల్లము, బియ్యము.

స్త్రీసమములకు ఏదియును రాదు.

తండ్రి, తల్లి, అన్న బల్ల మొదలగునవి.

వచనములు.

తెలుఁగులో వచనములు రెండు. 1. ఏకవచనము, 2. బహువచనము. సంస్కృతమునందలి ద్వివచన మీభాషలో లేదు. అదియును బహువచనమునందే చేరును. ఒకవస్తువున దెలుఁపుమాట ఏకవచనము. ఒకటికంటె నెక్కువ వస్తువులన దెలుపుమాట బహువచనము.

ప్రథమావిభక్తి ప్రత్యయములలో 'డు, ము, వు,' అన పీనుఁగడును ఏకవచనమునందే వచ్చును. రాముఁడు, వనము, ధేనువు. 'లు' వర్ణకము బహువచనమునందు అన్నిశబ్దముల

కంటెను వచ్చును. 'ము' వర్ణమునకు ద్విత్వముగాని, ...
పూర్వక 'బు' వర్ణముగాని వికల్పముగా వచ్చును.

వనము-వనమ్ము, వనంబు.

శబ్దములతుది నున్న 'ఇయ' కు మారుగా 'ఎకారము' వికల్పముగ వచ్చును. కన్నియ-కన్నె. విడియము-విడెము.

ఉకారాంతమహద్వాచకములకంటె 'డు, వు' లలో నేవియేని రావచ్చును. గురుఁడు, గురువు. శంభుఁడు, శంభువు. సకారాంతములైన హలంతశబ్దముల తుదిహల్లు వికల్పముగ లోపించును. ఉరము-ఉరస్సు. మనము-మనస్సు. ధనువు-ధనుస్సు.

చరిత్రము మొదలగుశబ్దముల 'ము' వర్ణకమునకు లోపము బహుళముగా వచ్చును.

బహుళ మనఁగా, కొన్నియుదాహరణములలో తప్పక వచ్చుట, కొన్నిటిలో రాకుండుట, కొన్నిట వికల్పముగా వచ్చుట, ఒక్కొకచోట నితరకార్యములు వచ్చుటయును.

చరిత్ర-చరిత్రము. చరిత-చరితము. అభిలాష-అభిలాషము. బహుళ మనుటచే దర్శ, పనస మొదలగుశబ్దములలో లోపము నిత్యము. ఇమనిచ్ ప్రత్యయాంతముల 'ము' వర్ణకమునకు లోపము వికల్పముగ వచ్చును. గరిమ-గరిమము. మహిమ-మహిమము. లఘిమ-లఘిమము.

ప్రథమావిభక్తిబహువచనమున 'లు' వర్ణకము వచ్చును. వనిత వనితలు. వనలా-వనలాలు. వనంబు-వనంబులు. వనమ్ము-వనమ్ములు. భ్రాత-భ్రాతలు. దిక్కు-దిక్కులు.

ఇకారాంతశబ్దములకు బహువచనము పరమగునపుడు తుది ఇకారము ఉకారముగా మాఱును. హరి-హరులు, కరి-కరులు. కత్తి-కత్తులు.

ఇకారము ఉపాంత్యముగాఁ గలశబ్దములలో రెండికారములకును ఉకార మగును. ఉపాంత్య మనఁగా చివర నున్నదానికి ముందున్నది.

కలికి-కలుకులు, ములికి-ములుకులు.

రెండక్షరములు గల ఇకారాంతశబ్దములకును, 'ర,ల,డ' లు ఉపధగాఁ గలశబ్దములకును ఉపాంత్యమైన ఇకారము ఉకారముగా మాఱును. ఉదా:—జిగి-జిగులు. పందిరి-పందిరులు. పిసికిలి-పిసికిళులు. రాపిడి-రాపిడులు.

కొన్ని నువర్ణాంతశబ్దముల 'ను' వర్ణమునకు బహువచనము పరమగునపుడు బిందుపూర్వక మైన 'కు' వర్ణము వచ్చును. ఉదా:—కొలను-కొలఁకులు, కొలంకులు. కెలను-కెలఁకులు, కెలంకులు. ఇట్లే-కోఱను, వలను, వరను, గవను.

రేను గోను శబ్దముల 'ను' వర్ణమునకు బహువచనము పరమగునపుడు బిందుపూర్వకమైన 'గు' వర్ణము వచ్చును. ఉదా:—రేను-రేఁగులు. గోను-గోఁగులు.

బహువచనము పరమగునపుడు కొన్నిశబ్దముల తుది వర్ణము లోపించును. చేను-చేలు. పేను-పేలు. మ్రాను-మ్రాలు రేయి-రేలు. తాయి-తాలు. వ్రాయి-వ్రాలు. వేయి-వేలు,

కొన్నిటి కిట్లోపము వికల్పముగ వచ్చును. ఆవు-ఆవులు, ఆలు. జాము-జాములు, జాలు. చుట్టము చుట్టములు,-చుట్టలు. మీసము-మీసములు, మీసలు.

దీర్ఘపూర్వకలకారము ఉపధగాఁగల తత్సమమహద్వాచక శబ్దమునకు బహువచనమున 'రు' వచ్చును.
ఉదా:-బాలుఁడు-బాలురు. కృపాలుఁడు-కృపాలురు.

కొన్ని తెలుఁగుశబ్దములకు బహువచనమున 'రు' వచ్చును.

బహువచనము పరమగునపుడు కొన్ని ఉకారాంత శబ్దముల 'వు' వర్ణమునకు లోపము వికల్పముగా వచ్చును.

గురువు-గురులు, గురువులు. తరువు-తరులు, తరువులు. బహువచనము పరమగునపుడు 'డు, లు, టు, రు' వర్ణముల ఉకారమునకు లోపము వికల్పముగా వచ్చును. ఉదా:-పండు పండులు, పండ్లు. కాలు-కాలులు, కాళ్ళు. గొంటు-గొంటులు గొంట్లు. గోరు-గోరులు, గోర్లు.

కొన్ని తెలుఁగుశబ్దములకు బహువచనము పరమగునపుడు బిందుపూర్వక 'డు' వర్ణము బహుళముగా నగును. ఉదా:- కొడవలి-కొడవండులు, కొడవండ్లు, కొడవలులు, కొడవళ్ళు. రోఁకలి మున్నగుశబ్దముల కిట్లే తెలియునది. ఇల్లు-ఇండులు, ఇండ్లు, ఇల్లులు, పల్లు-పండులు, పండ్లు,పల్లులు.

వస్తుస్వభావమునుబట్టి కొన్నిశబ్దములు నిత్యబహువచనాంతము లగును. ఉదా:-నూనెలు, కందులు, వడ్లు, పెసలు, జొన్నలు మున్నగునవి,

కొన్నిశబ్దములకు బహువచన ముండదు.
పైఁడి, వెండి, కీడు, మొన్న, నిన్న, రేపు, మాపు మున్నగునవి.

### ప్రథమాది విభక్తులు.

ఒకవాక్యములో విశేష్యములకుఁగాని, సర్వనామములకుఁగాని వేఱొకపదములతోఁ గలుగుసంబంధమును దెలిపెడి ప్రత్యయములను విభక్తిప్రత్యయము లందురు. అవి యేడు విధములు.

డు, ము, వు, లు—ప్రథమావిభక్తి
ని, ను, లన్, కూర్చి, గుఱించి—ద్వితీయావిభక్తి
చేన్, చేతన్, తోన్, తోడన్—తృతీయావిభక్తి
కొఱకున్, కై—చతుర్థీవిభక్తి
వలనన్, కంటెన్, పట్టి—పంచమీవిభక్తి
కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్-షష్ఠీవిభక్తి
అందున్, నన్-సప్తమీవిభక్తి

ప్రాతిపదికార్థమునందు ప్రథమావిభక్తివచ్చును.

రాముఁడు, శంభువు, వనము, వనిత, గిరి, బంటు, కన్నె స్త్రీ, శ్రీ.

ఎదుటివానిని బిలుచునపుడు విశేష్యములమీఁద నుండు ప్రథమావిభక్తి సంబోధనప్రథమావిభక్తి యనఁబడును.

సంబోధనమున ఏకవచనములో నామవాచకముతుది ఉకార మునకు అకారము వచ్చును. ఉదా:—రాముఁడ, వనమ, శంభువ, ఇంట.

సంబోధనమున సంస్కృతనామవాచకముల 'డు'వర్ణక మునకు లోపము వికల్పముగా వచ్చును. రాముఁడ, రామ, సంస్కృతనామవాచకము లనుటచేఁ దెనుఁగున నీలోపము రాదు. అక్కజుఁడ, ఎల్లిదుఁడ, మగఁడ.

ఉకారాంతములైన సంస్కృతనామవాచకముల మీఁది 'డు' వర్ణమునకు సంబోధనమున ప్లుతము వచ్చును. శంభు 3 గురు 3. సంబోధనమున బహువచనమునందు 'ఆర' ఆగమ ముగా వచ్చును. రాములార, బాలురార, జవరాండ్రార.

సంబోధనమున నామవాచకముతుదినున్న అకారఇకార ములకు దీర్ఘము వికల్పముగా వచ్చును.ఉదా:—రామ,రామా రాముఁడ, రాముఁడా; హరి, హరీ; తండ్రి, తండ్రీ; బాలురార, బాలురారా.

ఏకవచనమున పురుషసంబోధనమున నామవాచకము నకు ముందు 'ఓయి' యును, స్త్రీసంబోధనమున 'ఓసి' యును ఆగమములుగ వికల్పముగ వచ్చును. ఉదా:-ఓయిరాముఁడ, రాముఁడ; ఓరిదురాత్మ, దురాత్మ; ఓరిమిత్త్రుఁడ, మిత్త్రుఁడ; ఓసి దురాత్మురాల, దురాత్మురాల; ఓసిచెలి, చెలి.

లింగబోధకమైన 'ము' అంతమందుఁ గలశబ్దములకు ద్వితీయాదివిభక్తుల యేకవచనము పరమగునపుడు 'ని' అనునది వికల్పముగ వచ్చును. రామునిని, రాముని. రామునిచేతన్, రాముచేతన్. శంభునిని, శంభుని. శంభునిచేతన్, శంభుచేతన్.

అకారము తుదియందున్నశబ్దములకు 'ని' అనునది నిత్యముగ వచ్చును. మగనిచేతన్, వంగనిచేతన్.

ద్వితీయాదివిభక్తులు పరమగునపుడు బహువచనమున 'ల' అనునది ఆగమముగా వచ్చును. ఉదా:—రాములను, రాములచేతన్, రాములకొఱకున్, రాములవలనన్ మొదలగునవి.

'డు' వర్ణకము వచ్చుమహద్వాచకశబ్దములకును, 'ఇ' ఈ, ఐ, అంతమందుఁ గల పదములకును ద్వితీయైకవచనమున 'ని' వర్ణకము వచ్చును. రామునిని, శంభునిని, విధాతృనిని, మగనిని, హరిని, శ్రీని, పైని. తక్కినశబ్దముల ద్వితీయైకవచనమున 'ను' వర్ణకము వచ్చును. కొడుకును, ఆమెను, కుక్కను.

ఇకార, ఈకార, ఐకారాంతశబ్దములకు షష్ఠీవిభక్తి ఏకవచనమున 'కిన్' వచ్చును. హరికిన్, శ్రీకిన్, పైకిన్.

ఇవిగాక తక్కినచోట్ల 'కున్' వచ్చును. ఉదా:—తాతకున్, గోడకున్. నీ, మీ, శబ్దములు ఈకారాంతములే యైనను 'కున్' అనునదియే వచ్చును. నీకున్ మీకున్. 'కున్' పరమగునపుడు, ఉకారఋకారములకు 'న' అను నాగమము నిత్యముగ వచ్చును.

రామునకున్, విధాతృనకును, వనమునకున్, మొదలగునవి అందువర్ణకము పరమగునపుడు 'ఉకార ఋకారములకు'

'ను' అంతాగమముగా వచ్చును. రాముసందుఁ, వనముసందుఁ విధాత్రుసందుఁ.

ఉకారాంతము లగు అమహచ్ఛబ్దములకు సప్తమ్యేక వచనమున 'స' వర్ణకము వచ్చును. ఉదా:— వనమునఁ ఘనమునఁ, మొదలగునవి.

జడవాచకముల విభక్త్యర్థవిశేషణములు.

జడవాచకములమీఁది తృతీయాసప్తమీ విభక్తులకు ద్వితీయావిభక్తి బహుళముగా వచ్చును. ఉదా:—రాముఁడు వాలి నొకకోలఁ గూల నేసెను. (కోలన్=కోలతో) లంకను గల కలము పుట్టెను. (లంకను=లంకయందు) 'బహుళముగా' ననుటచే నీకార్యము ఉదంతశబ్దములమీఁద బహువచనమునందే యగును. ఏకవచనమునఁ గాదు. అర్జునుఁడు శత్రుసేనలను బాణముల రూపుమాపెను, బాణములఁ=బాణములచే నని యర్థము.

మీనంబు జలంబుల నుండును, జలంబులఁ=జలములందు

ఉకారాంత జడవాచకములమీఁది తృతీయావిభక్తికే'న' వర్ణకము వచ్చును. ఉదా:— రాముఁ డొక్క బాణంబున వాలిం గూలనేసెను. బాణంబునఁ=బాణముచే నని యర్థము.

జడవాచకములమీఁది ద్వితీయావిభక్తికి ప్రథమ బహుళముగా నగును. వాఁడు పూవులు దెచ్చె. పూవులు=పూవులను. వాఁడు పూవులను దెచ్చెను. ఆమె సొమ్ములు దాల్చె, ఆమె సొమ్ములను దాల్చె. వాఁడిల్లు వెడలె, వాఁడింటిని వెడలె. ఖారతకవుల ప్రయోగములలో జడవాచకముమీఁది ద్వితీయకు

ప్రథమ వచ్చుటయును, ఈప్రథమమీఁది కచటతపలకు గస
డదవలును నిత్యముగాఁ గానవచ్చెడిని. ఉదా:—వేదాధ్య
యనంబు సేసియు ద్రోహోక్తులు వలుకఁదగునే.

ఇచట బహుళముగా వచ్చు ననుటచే వెనుకటి సూత్ర
ముచే తృతీయాసప్తములకు మాఱుగ వచ్చిన ద్వితీయకు
ప్రథమ రాదు. కాలవాచకములమీఁదను, మార్గవాచకముల
మీఁదను దఱుచుగ ప్రథమ యగును. ఉదా:— వాఁడు నిన్న
వచ్చెను. వీ రామడ వోయిరి.

ఔపవిభక్తికములు.

ఔపవిభక్తికము లనఁగా సమీపమునందలి విభక్తిని
ఆధారముగాఁ జేసికొని వచ్చునవి. విభక్తి పరమగునపుడు
కొన్ని శబ్దములతుదిని ఆగమముగాఁ గాని, ఆదేశముగాఁ గాని,
రెండువిధములుగాఁగాని వచ్చునట్టి ఇ,టి,తి అనువర్ణములు ఔప
విభక్తికములు. ఇవి ద్వితీయాదివిభక్తులు పరమగునపుడు
కొన్ని నామవాచకములకును సర్వనామములకును దఱుచుగాఁ
జేరుచుండును.

(1) ఊరు మొదలగుశబ్దములకు 'ఇ' వర్ణము వచ్చును.
ఊరు—ఊరిని, ఊరికొఱకు, ఊరియందు, ఊరిలో.
ఇట్లే—కోడలు, చెల్లెలు, ప్రేలు, కాలు, ప్రోలు, మొదలగునవి.

(2) 'టి' వర్ణము కొన్నిశబ్దముల కంతాగమముగను,
కొన్నింటి కంతాదేశముగను వచ్చును.

ఆగమము— అన్ని-అన్నిటిని. తొమ్మిది-తొమ్మిదిటిని. ఆదేశము-ఏఱు-ఏటిని. తాఁబేలు-తాఁబేటిని. కొన్నిటికి వరుసగ రెండువిధములుగను వచ్చును. పగలు-పగలిటిని-పగటిని. మొదలు-మొదలిటిని, మొదటిని.

(3) హ్రస్వముమీఁది టివర్ణమునకు పూర్ణబిందువు బహుళముగా నగును. పగలు-పగంటిని, పగలింటిని. అన్ని-అన్నింటిని. ఎనిమిది-ఎనిమిదింటిని.

(4) పదాదిహ్రస్వముమీఁది టివర్ణమునకు నిండుసున్న నిత్యముగా వచ్చును. విల్లు-వింటిని. కన్ను-కంటిని. ఇల్లు-ఇంటిని. పల్లు-పంటిని.

(5) 'ఇ,టి' వర్ణములు కొన్నిశబ్దములకు పర్యాయముగా నగును. గోరు-గోరిని, గోటిని. నోరు-నోరిని, నోటిని.

(6) అఱ్ఱు మొదలగువానికి 'తి' వర్ణము అంతాగమముగా నగును; అగునపుడు ఒక రేఫమునకు లోపమును వచ్చును. 'టి,తి' వర్ణములు పరమగునపుడు ముందున్న ఉకారమునకు ఇకార మగును. ఉదా—అఱ్ఱు-అఱితిని. కొఱ్ఱు-కొఱితిని. టివర్ణమునకు—రెండు-రెండిటికి.

(7) విభక్తి పరమగునపుడు గోయి మొదలగువాని తుది యక్షరమునకు 'తి' ఆదేశముగా వచ్చును. గోయి-గోతులు, గోతిని, గోతిలోన్.

(8) 'టి' వర్ణము పరమగునపుడు క్రిందు, మీఁదుఁ ముందు, తేవు, మాఁపు మొదలగుశబ్దముల ఉకారమునకు

ఆకార మగును. క్రిందు-క్రిందటికిఁ. మీఁదు-మీఁదటికిన్. రేపు-రేపటికిన్. ముందు-ముందటికిఁ. మాపు-మాపటికిన్. అప్పుడు-అప్పటికిఁ.

(9) ఔపవిభక్తికశబ్దముల తృతీయాసప్తములకు 'అఁ' బహుళముగా నగును. గోరన్ గీఱెను. గోరఁ=గోటితోఁ. గొడ్డటఁ నఱికెను. గొడ్డటితోఁ నని యర్థము. నూతఁబడెను. నూతఁ=నూతియందు అని యర్థము.

కొన్నిశబ్దముల విభక్త్యంతస్వరూపములు.

౧. నామవాచకము-మహద్వాచకము :—

| | ఏకవచనము | బహువచనము |
|---|---|---|
| ప్ర. | నరుఁడు | నరులు |
| ద్వి. | నరుని, నరునిఁ | నరులను, నరులనుఁ. |
| | నరుఁ, నరునిగూర్చి | నరులన్, నరులనుగూర్చి, |
| | నరునిగుఱించి | నరులనుగుఱించి. |
| తృ. | నరునిచేతఁ, నరుచేతన్ | నరులచేతన్. |
| | నరునిచేఁ, నరుచేన్ | నరులచేన్. |
| | నరునితోడన్, నరుతోడన్, | నరులతోడన్. |
| | నరునితోన్, నరుతోన్, | నరులతోన్. |
| చ. | నరునికొఱకుఁ, నరుకొఱకున్ | నరులకొఱకున్. |
| | నరునికై, నరుకై | నరులకై. |
| పం. | నరునివలనన్, నరువలనఁ | నరులవలనన్. |
| | నరునికంటెఁ, నరుకంటెఁ | నరులకంటెన్. |
| | [illegible], నరుఁబట్టి | నరులఁబట్టి |

| | |
|---|---|
| ష. నరునికిన్, నరునకున్, | నరులకున్. |
| నరునియొక్క, | నరులయొక్క. |
| స. నరునియందున్, | నరులయందున్. |
| నరునందున్ | నరులందున్. |
| సం. నరుఁడ! | నరులార! |
| నరుఁడా! | నరులారా! |
| ఓనరుఁడ! | ఓనరులార! |
| ఓనరుఁడా! | ఓనరులారా! |

పండితుఁడు, మిత్త్రుఁడు, మనుష్యుఁడు మొదలగు శబ్దములకిట్లే తెలియవలెను.

| మహతీవాచకము | | అమహద్వాచకము | |
|---|---|---|---|
| ఏక | బహు | ఏక | బహు |
| బాలిక | బాలికలు | వనము | వనములు |
| బాలికను | బాలికలను | వనమును | వనములను |
| బాలికచేన్ | బాలికలచేన్ | వనముచేన్ | వనములచేన్ |
| బాలికకై | బాలికలకై | వనమునకై | వనములకై |
| బాలికకంటెన్ | బాలికలకంటెన్ | వనమువలనన్ | వనములవలనన్ |
| బాలికయొక్క | బాలికలయొక్క | వనముయొక్క | వనములయొక్క |
| బాలికయందున్ | బాలికలయందున్ | వనమునందున్ | వనములందున్ |
| | | వనమునన్ | వనములన్ |
| ఓ బాలికా! | ఓ బాలికలార! | వనమ! | వనములార! |

## ౩. సర్వనామములు.

| ఏక | బహు | ఏక | బహు |
|---|---|---|---|
| వాఁడు | వారు | అది | అవి |
| వానిని | వారిని | దానిని | వానిని |
| వానిచేన్ | వారిచేఁ | దానిచేఁ | వానిచేన్ |
| వానికై | వారికై | దానికై | వానికై |
| వానివలనఁ | వారివలనఁ | దానికంటెన్ | వానికంటెఁ |
| వానికిన్ | వారికిఁ | దానికిఁ | వానికిన్ |
| వానియందుఁ | వారియందుఁ | దానియందుఁ | వానియందుఁ |

సర్వనామములకు సంబోధన ప్రథమావిభక్తి యుండదు. "వీఁడు,ఎవఁడు,అతఁడు,ఇతఁడు"మున్నగు వానికిట్లు తెలియవలెను

| | ఇది | | ఏది | |
|---|---|---|---|---|
| | ఏక | బహు | ఏక | బహు |
| ప్ర. | ఇది | ఇవి | ఏది | ఏవి |
| ద్వి. | దీనిని | వీనిని | దేనిని | వేనిని |
| తృ. | దీనిచేఁ | వీనిచేఁ | దేనిచేఁ | వేనిచేఁ |

| | నేను | | నీవు | |
|---|---|---|---|---|
| | ఏక | బహు | ఏక | బహు |
| ప్ర. | నేను | మేము | నీవు | మీరు |
| ద్వి. | నన్నుఁ | మమ్ముఁ | నిన్నుఁ | మిమ్ముఁ |
| తృ. | నాచేఁ | మాచేఁ | నీచేఁ | మీచేఁ |

తక్కిన వానిరూపముల నూహింపవచ్చును.

3. ఔపవిభక్తికములు ఇ, తి, ంటి, టి.

| | ఇ | తి | ంటి | టి |
|---|---|---|---|---|
| ప్ర. | ఊరు | గోయి | విల్లు | త్రాడు |
| ద్వి. | ఊరిని | గోతిని | వింటిని | త్రాటిని |
| తృ. | ఊరన్ | గోతఁ | వింటఁ | త్రాటఁ |
| | ఊరిచేఁ | గోతిచేఁ | వింటిచేన్ | త్రాటిచేన్ |
| స. | ఊరియందున్ | గోతియందుఁ | వింటియందుఁ | త్రాటియందుఁ |
| | ఊరఁ | గోతఁ | వింటన్ | త్రాటఁ. |

**విశేషణములు-వాని విశేషములు**

(1) తెలుఁగు విశేషణములు సాధారణముగ త్రిలింగ సమములై యుండును. కావున లింగవచనాదిభేదములు లేక యెల్ల విశేష్యములకు ముందు ప్రయోగింపఁబడును. ఉదా:—పెద్ద మనుష్యుఁడు, మంచి పడఁతి.

(2) అకారాంతగుణవాచక విశేషణములతుదిని విశేష్యము పరమగునపుడు 'ని' వర్ణము బహుళముగా ఆగమముగ వచ్చును. నల్ల బల్ల, నల్లని బల్ల. చక్కని బాలుఁడు. చిన్న పుస్తకము. కమ్మఁ దేనె, కమ్మని దేనె. గున్నమామిడి.

(3) 'ము' వర్ణకాంతవిశేషణముల మువర్ణమునకు విశేష్యము పరమగునపుడు 'పు' వర్ణముగాని, బిందుపూర్వక పువర్ణము (ంపు) గాని ఆదేశముగ వచ్చును. ఉదా:—సరసము+మాట=సరసపు మాట, సరసంపుమాట. విరసము+మాట= విరసపుమాట, విరసంపుమాట.

(4) ఒకానొకచోఁ గొన్ని విశేష్యములు విశేషణములుగ వాడఁబడును. పసిఁడి కంచము. వెండి పళ్ళెము. ఇత్తడి చెంబు.

(5) విశేషణములు విశేష్యములతోడను సర్వనామములతోడను అన్వయించును. మంచి బాలుఁడు, మంచి వాఁడు.

(6) తత్సమవిశేషణములు వానివానివిశేష్యములతో సమానమైన లింగము విభక్తి వచనము కలిగియుండును. రాముఁడు యోగ్యుఁడు. సీత యోగ్యురాలు. పాటుపడుట యోగ్యము. వారు యోగ్యులు. యోగ్యులబాలురను మెచ్చుకొందురు.

(7) షష్ఠ్యంతములైనవిశేషణములకు వికల్పముగా ప్రథమ వచ్చును. సుగుణాభిరాముఁడు రామునకు వందనము లర్పించెదను. సుగుణాభిరామునకు రామునకు వందనము లర్పించెదను.

(8) స్త్రీసమములైనట్టికాని సువర్ణకాంతములైనట్టికాని విశేషణముల బహువచనమునకు ఏకవచనము వికల్పముగా వచ్చును. పెక్కు మాట లేల. మాటలు పెక్కు లేల. వానిపలుకులు చిత్రముగా నున్నవి. వానిపలుకులు చిత్రములుగా నున్నవి.

(9) అగుణాంతఅవ్యయవిశేషణములచే వ్యవధానము చేయఁబడినట్టివిగాని సముచ్చయవాచకములచేఁ గలుపఁబడినట్టిగాని విశేషణములకు ప్రథమ వచ్చును. ఉదా:—శూరుఁడును రాము

నిచే రావణుఁడు చంపఁబడెను. యోగ్యుఁడు ధీరుఁడు నగు రామునికొఱకు జనకుఁడు కన్య నిచ్చెను.

(10) ఏకవచనమునందుండు రెండు మూఁడు విశేష్యముల విశేషణమునకు బహువచనంబగును. పూజ్యులగు రాముఁడును కృష్ణుఁడును అక్రూరుఁడును గోకులమునకు విచ్చేసిరి.

(11) ఒకానొకచో పుంలింగవిశేషణములు కొన్ని నపుంసకసమములై యుండును. అంతమైన మనుష్యుఁడు. నిజమైన పురుషుఁడు.

(12) ధాతుజవిశేషణములకు, విభక్తి చేయఁదలఁచినపుడు వాఁడు, అది, అనునవి వచ్చును. చదివినవాఁడు, చదివినది. రానివాఁడు, రానిది.

### అచ్చతెలుఁగుపదములలోఁ గలుగు వర్ణములమార్పులు.

పదాదియందుండక, సంయుక్తముగాని గకారమునకు వకారము వికల్పముగా నగును.

పలుగురు-పలువురు. ఇరుగురు-ఇరువురు. పగడము-పవడము. వేగురు-వేవురు-తొగ-తొవ. పగలు-పవలు.

పదాంతమునందలి 'ఇయ' కు మాఱుగ 'ఎ' వచ్చును. కన్నియ-కన్నె. వన్నియ-వన్నె. కొంచియము-కొంచెము.

అచ్చికపదములలోని అయి, అవు లకు 'ఐ, ఔ' లు వికల్పముగా వచ్చును.

అయి-ఐ, బాగయి-బాగై. అవు-ఔ, నిగ్గవు-నిగ్గౌ.

### ధాతువులమీఁది కృదంతరూపములు.

౧. ధాతువులవలన నేర్పడు నామవాచకములు 'కృదంతము' లనఁబడును.

౨. కృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని ధాతువుల తుదియక్షరమునకు లోపము వచ్చును.

భావార్థమున ధాతువునకు 'క' వర్ణక మగును.

అలుగు-అలుక, ఎఱుఁగు-ఎఱుక, కడఁగు-కడఁక, కలఁగు-కలఁక, తునుగు-తునుక, నడచు-నడక. ఇచట కృత్ప్రత్యయమగు 'క' పరమగునపుడు, అలుగు మొదలగువాని కడయక్షరము లోపించినది. కినియు-కినుక. ముదియు-ముదుక. వీనిలో ఇకారమునకు ఉకార మాదేశముగ వచ్చినది. కను-కానుక. ఇచట మొదటియక్షరమునకు దీర్ఘము.

౩. 'ఇమి' వర్ణకము 'కలుగు' లోనగువాని కగును. కలుగు-కలిమి, నేరుచు-నేరిమి, బ్రదుకు-బ్రదిమి.

౪. 'ఁత' వర్ణకము చేయు మొదలగువాని కగును. చేయు-చేఁత, పోయు-పోఁత, మేయు-మేఁత, కూయు-కూఁత, రోయు-రోఁత,

౫. 'కువ' వర్ణకము అడఁగు మొదలగువాని కగును. అడఁగు- అడఁకువ, కలఁగు-కలఁకువ, ఎఱుఁగు-ఎఱుకువ, పెనఁగు-పెనఁకువ.

౬. 'ట' వర్ణకము ఆడులోనగువానికగును. ఆడు-ఆట, పాడు-పాట, ఊరు-ఊట.

౭. 'టు' వర్ణకము పడు లోనగువాని కగును. అగుచో మొదటియక్షరము మిగిలి దీర్ఘము వచ్చును.
పడు-పాటు, చెడు-చేటు, కఱచు-కాటు, అడుచు-ఆటు, వయిచు-వాటు, పొడుచు-పోటు.

౮. 'త' వర్ణకము ఆవులించు మొదలగువాని కగును.
ఆవులించు-ఆవులింత, ఇంగిలించు-ఇంగిలింత, కుళ్ళగించు-కుళ్ళగింత.

౯. 'పము' వర్ణకము తిరియు లోనగువాని కగును.
తిరియు—తిరిపము. పొలయు-పొలపము. వలయు-వలపము. కలియు-కలపము.

౧౦. 'పు' వర్ణకము మాయు లోనగువాని కగును.
మాయు-మాపు. మేయు-మేపు. త్రోయు-త్రోపు. తలఁచు-తలఁపు.

౧౧. 'గడ' వర్ణకము చేరు మొదలగువాని కగును.
చేరు-చేరుగడ. మను-మనుగడ. తీఱు-తీఱుగడ.

౧౨. 'ఇకి' వర్ణకము కోరు మొదలగువాని కగును.
కోరు-కోరికి. మను-మనికి. విను-వినికి.

౧౩. 'వు' వర్ణకము మను మొదలగువాని కగును.
మను-మనువు, చచ్చు-చావు. పూచు-పూవు.

౧౪. 'అకము' వర్ణకము మాఱు లోనగువాని కగును.
మాఱు-మాఱకము, అమ్ము-అమ్మకము.

౧౫. 'అ' వర్ణకము ఎండు మొదలగువాని కగును.

ఎండు- ఎండ. గీఱు-గీఱ. ఊదు- ఊద.

౧౬. 'డు' వర్ణకము ఆఱు మొదలగువాని కగును.

ఆఱు-ఆఱుడు. అమ్ము-అమ్ముడు. త్రొక్కు-త్రొక్కుడు. పై ప్రత్యయము లన్నియు భావార్థమున వచ్చినవియే. ఇంకను కృత్ప్రత్యయములు కర్త్రర్థమునందును, కర్మార్థమునందును, వచ్చుచుండును. వ్యవహారమునుబట్టి యా యా యర్థములు తెలియనగును.

ఏలిక=ఏలువాఁడు. (కర్త్రర్థకము.)

కోరిక=కోరఁబడునది. (కర్మార్థకము)

తద్ధితప్రత్యయాంతములు.

నామవాచకములకంటెను కొన్ని విశేషణములకంటెను స్వార్థమునందును భావాదివిశేషార్థములందును వచ్చు ప్రత్యయములు తద్ధితములు. అవి తుదియందున్న శబ్దములు తద్ధితాంతములు.

1. స్వార్థకములు.

ఏతద్ధితప్రత్యయములు చేరకమును పున్నయర్థమే చేరిన పిమ్మటఁ గూడ నుండునో యాతద్ధితప్రత్యయములు స్వార్థకము లనఁబడును.

'ఉక' వర్ణకము చిఱుత లోనగువాని కగును.

చిఱుత+ఉక=చిఱుతుక. నెలఁత-నెలఁతుక. నిప్పు-నిప్పుక. ఎమ్ము-ఎమ్ముక.

'ఇక' వర్ణకము అరమర లోనగువాని కగును.
అరమర-అరమరిక. వాలు-వాలిక. చీలు-చీలిక. మొలి-మొలిక. మూస-మూసిక.

'కార' వర్ణకము కొలఁత మొదలగువాని కగును,
కొలఁత-కొలగారము. నడి-నడికారము.

'ఇత' వర్ణకము ఇంపు మొదలగువాని కగును.
ఇంపు-ఇంపితము. బిగి-బిగితము. పోరు-పోరితము.

## 2. భావార్థకములు.

'తన' వర్ణకము భావార్థమునం దగును. భావార్థ మనఁగా స్వభావసిద్ధమును దెలుపునది. దొంగ-దొంగతనము. దొంగ యొక్క స్వభావము, ఇట్లే-మగతనము, గొప్పతనము.

'ఱిక' వర్ణకము చిన్న లోనగువాని కగును.

చిన్న-చిన్నఱికము. కన్నె-కన్నెఱికము. చుట్టము-చుట్టఱికము. ఒకపక్షమున చిన్నతనము, కన్నెతనము,మున్నగు రూపములు నగును.

ఱికము పరమగునపుడు ఉకారమున కకార మగును.

తొత్తు-తొత్తఱికము. వెజ్జు-వెజ్జఱికము.

'ఇమి' వర్ణకము పేరు లోనగువాని కగును.

పేరు-పేరిమి. పోఁడి-పోఁడిమి. వాఁడి-వాఁడిమి.

'న' వర్ణకము గుణవాచకంబులగు నల్ల మున్నగువాని కగును.
నల్ల-నల్లన. పచ్చ-పచ్చన. ఎఱ్ఱ-ఎఱ్ఱన. తియ్య-తియ్యన. కమ్మ-కమ్మన. పుల్ల-పుల్లన. చప్ప-చప్పన. మొదలగునవి.

3. మతుబర్థకములు.

కలవాఁడు కలది అనునర్థములందు వచ్చు ప్రత్యయములు మతుబర్థకము లనఁబడును.

చెలిమి లోనగు శబ్దములకుఁ బురుషుని దెలుపునపుడు 'కా' ప్రత్యయమును, స్త్రీని దెలుపునపుడు 'కత్తియ' ప్రత్యయమునువచ్చును. చెలిమికాఁడు=చెలిమి కలవాఁడు అని యర్థము.

చెలిమికత్తియ=చెలిమికలది అని యర్థము.

ఆటకాఁడు, ఆటకత్తియ, ఆటకత్తె.

ఎమ్మె, ఒయారము కొల్ల, చేరువ, పోడిమి, జూదము, తిండి, తేర, నీటు, నేస్తము, బేరము, సాగసు మొదలగువాని కిట్లే తెలియునది.

కాకత్తియల కకారమున కొకచో గకార మగును.

అందగాఁడు, అందగత్తియ, అందగత్తె.

'కా' ప్రత్యయము తిర్యక్కులకును గానఁబడియెడి.

ఇబ్బందికాఁడు, పరికాఁడు, ఒంటరికాఁడు.

'ఈ' ప్రత్యయము అటమటము మొదలగువానికి పురుషుని దెలుపునపు డగును.

అటమటము + ఈఁడు=అటమటీఁడు. కమ్మతము-కమ్మతీఁడు. బాసనము-బాసనీఁడు.

'అరి' వర్ణకము జాలము లోనగువాని కగును.

జాలము+అరి=జాలరి. పూజ-పూజరి. చదువు-చదువరి. వెరవు-వెరవరి. తగవు-తగవరి.

'త' వర్ణకము కలవాచకశబ్దములకు స్త్రీని దెలుపునపు డగును,

సాలె - సాలెత. బోయ - బోయత. చాకి-చాకిత. వేగ్రి-వేగ్రిత.

'ఇ' వర్ణకము ఒయారము మొదలగువాని కగును.

ఒయారము-ఒయారి. అక్కసము-అక్కసి. కడలు-కడలి.

చాగము-చాగి. బేహారము-బేహారి. మిటారము-మిటారి.

'ఆఁడి' వర్ణకము స్త్రీని దెలుపునప్పుడు బహువచనాంతము లైన వగాదుల కగును.

వగలు-వగలాఁడి. చిన్నెలు-చిన్నెలాఁడి. వన్నెలు-వన్నెలాఁడి. ఎమ్మెలు-ఎమ్మెలాఁడి.

'ఆ' వర్ణకము బహువచనాంతము లైన వగాదులకు పురుషుని దెలుపునపు డగును.

వగలాఁడు, చిన్నెలాఁడు వన్నెలాఁడు, ఎమ్మెలాఁడు.

'ఇఁడి' వర్ణకము ముక్కులోపగు వానికి, వాని లేమిని దెలుపునపు డగును. ముక్కు+ఇఁడి=ముక్కిఁడి=ముక్కు లేనివాఁడు. వెరవు-వెరవిడి. సిగ్గు-సిగ్గిఁడి.

## 4. పరిమాణార్థకములు.

'ఎఁడు' వర్ణకము మానార్థమునం దగును. మాన మనఁగా కొలఁత.

తూము-తూమెఁడు. బుట్టి-బుట్టెఁడు. గంప-గంపెఁడు. జేన-జేనెఁడు. ముంత-ముంతెఁడు.

'ఎఁడు' వర్ణకము పరమగునపుడు లి వర్ణము లోపించును. దోసిలి+ఎఁడు=దోసెఁడు. సందిలి-సందెఁడు. కమికిలి-కమికెఁడు. పుడిసిలి-పుడిసెఁడు.

### ౫. దఘ్నార్థకములు.

'బంటి, కోలఁది' అనువర్ణకములు దఘ్నార్థమునం దగును. దఘ్నార్థ మనఁగా లోతును దెలుపుట.

ఱొమ్ము-ఱొమ్ముబంటి, ఱొమ్ముకోలఁది.

మోఁకాలు-మోఁకాలుబంటి, మోఁకాలుకోలఁది.

కటి-కటిబంటి, కటికోలఁది.

ఇతరములైన ప్రత్యయములును ఆ యా యర్థములందు మహాజనుల ప్రయోగము ననుసరించి తెలియవలెను.

మంటిమారి, తిండిపోతు. ఆస్వభావము గలవాఁడను నర్థమున 'మారి, పోతు, అను వర్ణకములు.

అడపము+అ=అడప. తాంబూలపుఁ బెట్టెను దెచ్చునది. మతంబర్థమున 'అ' ప్రత్యయము.

పెండ్లము-పెండ్లి+అము=పెండ్లము.

పెండ్లి శబ్దమునకు మతుబర్థమున 'అము' ప్రత్యయము.

# వాక్య ప్రకరణము.

కొన్ని పదములు గలిసి యొకయర్థము నిచ్చినచో నట్టి పదములసమూహమునకు 'వాక్యము' అని పేరు.

వాక్యములు రెండువిధములు.

1. సమాపక వాక్యము. 2. అసమాపక వాక్యము.

సమాపకక్రియతోఁ గూడిన వాక్యము సమాపక వాక్యము. బాలుఁడు పాఠము చదివెను.

అసమాపకక్రియతోఁ గూడినవాక్యము అసమాపక వాక్యము. బాలుఁడు పాఠము చదివి.

సమాపక వాక్యములు మూఁడు విధములు—

1. సరళవాక్యము (Simple Sentence.)

2. సంశ్లిష్టవాక్యము (Complex Sentence.)

3. ద్వంద్వవాక్యము (Compound Sentence.)

(1) ఒక్కసమాపక క్రియతోమాత్రముకూడినవాక్యము సరళవాక్యము. దీనిని 'సామాన్యవాక్యము' అనికూడ నందురు.

బాలుఁడు పాఠముఁ జదివెను.

(2) ఒక్కసమాపకక్రియయు, ఒకటికాని యెక్కువకాని యసమాపకక్రియలును, గలవాక్యమునకు 'సంశ్లిష్టవాక్యము' అని పేరు.

౧. బాలుఁడు పాఠము చదివి నిద్రించెను.

౨. బాలుఁడు పాఠము చదివి, వ్యాసము వ్రాయుచు నిద్రించెను.

(3) రెండుగాని యెక్కువకాని సమాపక వాక్యములు కలిసిన వాక్యమునకు ద్వంద్వవాక్య మని పేరు. దీనినే 'మహా వాక్యము' అనికూడ నందురు.

(౧) బాలుఁడు పాఠము చదివెను; గాని పరీక్షలో జయించెను. ఇచట రెండు సమాపక వాక్యములు 'కాని' అను మాటచేఁ గలుపఁబడినవి.

(౨) వానికి లెక్కలు బాగుగా వచ్చును; గాని తెలుఁగులోఁ దెలివి లేదు; కాఁబట్టి పరీక్షలో జయింపలేదు.

ఇచట మూఁడు సమాపక వాక్యములు 'కాని', కాఁబట్టి' అను రెండుమాటలచేఁ గలుపఁబడినవి.

ద్వంద్వవాక్యములలో నసమాపక వాక్యములుకూడ నుండవచ్చును. అనఁగా ద్వంద్వవాక్యమునందలివి సరళవాక్యములే కానక్కఱ లేదు; సంశ్లిష్టవాక్యములును గావచ్చును.

వాఁడు దిక్కులు చూచుచు, బడికిఁ బోవుచుండెను; కాఁబట్టి కాలికి దెబ్బ తగిలెను.

ఇచట 'వాఁడు దిక్కులు చూఁచుచు, బడికిఁ బోవుచుండెను.' అనునది సంశ్లిష్టవాక్యము. 'కాలికి దెబ్బ తగిలెను' అనునది సరళవాక్యము. ఈరెండును 'కాఁబట్టి' అనుపదముచేఁ గలుపఁబడినవి.

### కర్త్రర్థక వాక్యము—కర్మార్థక వాక్యము.

ఏ వాక్యమునందు క్రియచేఁ గర్త చెప్పఁబడునో, ఆ వాక్యము కర్త్రర్థక వాక్యము. దీనికే 'కర్తరిప్రయోగము' అని పేరు. కృష్ణుఁడు కంసుని జంపెను.

ఏ వాక్యమునందు క్రియచేఁ గర్మ చెప్పఁబడునో, ఆవాక్యము కర్మార్థకవాక్యము. దీనికే 'కర్మణిప్రయోగము' అని పేరు. కృష్ణునిచేఁ గంసుఁడు చంపఁబడెను.

కర్త్రర్థకవాక్యమునందు కర్త ప్రథమావిభక్తిలోను, కర్మ ద్వితీయావిభక్తిలోను ఉండును. కర్మార్థకవాక్యమునందు కర్త తృతీయావిభక్తిలోను కర్మ ప్రథమావిభక్తిలోను ఉండును. కర్త్రర్థకవాక్యమునందలి కర్తను తృతీయావిభక్తిలోనికిని, కర్మను ప్రథమావిభక్తిలోనికిని మార్చినచో నది కర్మార్థక మగును.

స్వార్థకవాక్యము—ప్రేరణార్థకవాక్యము.

స్వార్థకక్రియతోఁ గూడినవాక్యము స్వార్థకవాక్యము. బాలుఁడు పుస్తకమును జదివెను.

ప్రేరణార్థకక్రియతోఁ గూడినవాక్యము ప్రేరణార్థకవాక్యము. బాలునిచేఁ బుస్తకమును జదివించెను.

అన్వయలక్షణము. (Analysis)

వాక్యములోని వేర్వేఱు, పదముల పరస్పరసంబంధమును దెల్పుట 'అన్వయలక్షణ' మనఁబడును.

ప్రతివాక్యములోను కర్త, క్రియ, అను రెండుపదములు తప్పక యుండును. ఆ పదములకు సంబంధించిన యితరపదములుగూడ నుండవచ్చును. అందే యేపదములకుఁ బరస్పరసంబంధ మున్నదో తెలిసికొనవలెను.

1. బాలుఁడు పరుగెత్తెను. 2. పెద్దబాలుఁడు వడిగాఁ బరుగెత్తెను.

ఇందు మొదటివాక్యములో 'బాలుఁడు' అనుకర్తయు, 'పరుగెత్తెను' అనుక్రియయు మాత్రమే యున్నవి. రెండవ వాక్యమున కర్తకు విశేషణమైన 'పెద్ద' అనుపద మున్నది. అది కర్తతో నన్వయించును. 'వడిగాన్' అను క్రియావిశేషణము 'పరుగెత్తెను' అనుక్రియతో నన్వయించును.

సకర్మకక్రియ గలవాక్యములలో కర్మకూడ నుండును.

బాలుఁడు పుస్తకమును జదివెను.

ఇందు కర్మకు సంబంధించినమాటలు మఱికొన్ని యున్నచో నవి యాకర్మతో నన్వయించును.

బాలుఁడు పెద్దపుస్తకమును జదివెను.

ఇచట 'పుస్తకము' అనుకర్మకు 'పెద్ద' అను విశేషణ మున్నది. అది కర్మతో నన్వయించును.

ఇట్లే వాక్యములో నెన్నిపదము లున్నను నవి యన్నియు కర్తకర్మక్రియలకు సంబంధించియే యుండును.

బడికిఁబోయిన తెలివిగల మంచి బాలుఁడు తనమూఁడు కథల పుస్తకములను బాగుగా బోధపడునట్లు చదివెను. ఇందు బడికిఁబోయిన, తెలివిగల, మంచి, అను విశేషణములు 'బాలుఁడు' అను కర్తతోను, 'తన, మూఁడు, కథల' అను మాటలు 'పుస్తకము' అను కర్మతోను, బాగుగా, బోధపడునట్లు, అను క్రియావిశేషణములు 'చదివెను' అనుక్రియతోను నన్వయించును.

ఇట్లు ప్రత్యేకపదములే గాక, కొన్ని వాక్యములుకూడ కర్తకర్మక్రియలతో నన్వయించును.

ఎవఁడు పాఠములు బాగుగఁ జదువునో, వాఁడు పరీక్షలో జయించును. ఇచ్చట 'ఎవఁడు పాఠములు బాగుగఁ జదువునో' అను వాక్యము 'వాఁడు' అను కర్తతో నన్వయించును.

ఏది యావశ్యక మైనదో, దానినే మఱచిపోదుము. ఇచట 'ఏది యావశ్యక మైనదో' అనువాక్యము 'దానిని' అను కర్మతో నన్వయించును.

బీద లందఱు సుఖముగా జీవించునట్లు ప్రభుత్వము చూడవలెను. ఇచట 'బీదలందఱు సుఖముగా 'జీవించునట్లు' అనువాక్యము 'చూడవలెను' అను క్రియతో నన్వయించును.

శబ్దలక్షణము. (Parsing)

ఒక వాక్యమునందలి పదము లేభాషాభాగములో తెలుపుచు, వాని సంబంధమును నిరూపణము చేయువిధము 'శబ్దలక్షణ' మనఁబడును.

(1) ఒక మంచి బాలుఁడు ఒడికిఁ జని పాఠములను మిక్కిలిశ్రద్ధగాఁ జదివెను; కాఁబట్టి వానికి బహుమతి దొరకెను.

ఒక—సంఖ్యావాచకవిశేషణము. బాలుఁ డనువిశేష్యముతో నన్వయించును.

మంచి—గుణవాచకవిశేషణము. బాలుఁ డనువిశేష్యముతో నన్వయించును,

బాలుఁడు — జాతివాచకనామవాచకము, మహాదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, చదివెనను క్రియకుఁగర్త.

బడికి—జాతివాచక నామవాచకము, అమహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, 'చని' అను క్రియతో నన్వయించును.

చని—క్రియ చనుధాతువునుండి పుట్టినది, అకర్మకము, అసమాపకము, క్త్వార్థకము, బాలుఁడను కర్తతో నన్వయించును.

పాఠములను—జాతివాచక నామవాచకము, అమహదర్థకము, బహువచనము, ద్వితీయావిభక్తి, చదివెనను క్రియకుఁ గర్మ.

మిక్కిలి—అవ్యయము, 'శ్రద్ధగాఁ' అను క్రియావిశేషణముతో నన్వయించును.

శ్రద్ధగాఁ—క్రియావిశేషణము, చదివె నను క్రియతో నన్వయించును.

చదివెను—క్రియ, చదువుధాతువునుండి పుట్టినది, సకర్మకము, కర్త్రర్థకము, సమాపకము, స్వార్థకము భూతకాలము, ప్రథమపురుషము, ఏకవచనము. బాలుఁడను, కర్తతోను పాఠములను అను కర్మతోను నన్వయించును.

కాఁబట్టి—అవ్యయము, దొరకె నను క్రియతో నన్వయించును.

వానికి—ప్రథమపురుష వాచక సర్వనామము. మహదర్థకము, ఏకవచనము, షష్ఠీవిభక్తి, బాలుఁ డనువిశేష్యమునకు [illegible]గా నుపయోగింపఁబడినది.

బహుమతి—జాతివాచక నామవాచకము, అమహదర్థకము, ఏకవచనము, ప్రథమావిభక్తి, దొరకె నను క్రియకుం గర్త.

దొరకెను—క్రియ, దొరకు ధాతువునుండి పుట్టినది, అకర్మకము, సమాపకము, స్వార్థకము, భూతకాలము, ప్రథమపురుషము, బహుమతి యను కర్తతో నన్వయించును.

2. రాముఁడు సీతతో మంచి మాటలను జెప్పెను.

రాముఁడు—సంజ్ఞావాచక నామవాచకము, మహద్వాచకము, ప్రథమావిభక్తి, ఏకవచనము, చెప్పెను అను క్రియకుం గర్త.

సీతతోఁ—సంజ్ఞావాచక నామవాచకము, మహతీవాచకము, తృతీయావిభక్తి, ఏకవచనము, చెప్పెను అను క్రియతో నన్వయించును.

మంచి—గుణవాచకవిశేషణము, 'మాటలను' అను విశేష్యముతో నన్వయించును.

మాటలను—జాతివాచక నామవాచకము, అమహద్వాచకము, ద్వితీయావిభక్తి, బహువచనము, చెప్పెను అను క్రియకుం గర్మ.

చెప్పెను—క్రియ, చెప్పు ధాతువునుండి పుట్టినది, సమాపకము, సకర్మకము, భూతకాలము, ప్రథమపురుషము, ఏకవచనము, రాముఁడు అను కర్తతోను, మాటలను అను కర్మతోను అన్వయించును. ఇట్లే తక్కినవి తెలియునది.

## సమాసములు.

1. వేర్వే ఱర్థములు గలకొన్ని పదములు గూడి యొక్క పద మగుట 'సమాస' మనఁబడును. సమాసములోని పదములనే యుపయోగించి, సమాసమున కర్థము చెప్పుచో దానికి 'విగ్రహ' మని పేరు. రామబాణము. (సమాసము.)

రామునియొక్క బాణము. (విగ్రహము.)

2. 'సాంస్కృతికము, ఆచ్ఛికము, మిశ్రము' అని సమాసములు మూఁడువిధములు.

సాంస్కృతికము 'సిద్ధము, సాధ్యము,' అని రెండువిధములు. సంస్కృతలక్షణము ననుసరించినది సిద్ధసమాసము. తటాకోదకము, లక్ష్మీవల్లభుఁడు, పీతాంబరుఁడు, ఇందు మొదటిపదము కేవలసంస్కృతము, రెండవపదము తత్సమము.

తత్సమపదములతోఁ గూడినది సాధ్యసమాసము.

రామునాజ్ఞ, లక్ష్మీవల్లభుఁడు, తటాకంబునుదకము.

3. అచ్చ తెలుఁగుపదముల కలయికచే నేర్పడినది ఆచ్ఛికము,

చెఱువునీరు, లచ్చిమగఁడు, తేనియానతి.

4. ఆచ్ఛికతత్సమపదముల కలయికచే నేర్పడినది మిశ్రము.

సిరివల్లభుఁడు, తేనియాజ్ఞ, తటాకంబునీరు.

5. అవ్యయీభావము, తత్పురుషము, కర్మధారయము, బహువ్రీహి, ద్వంద్వము అని సమాసములు అయిదువిధములు.

6. పూర్వపదార్థము ప్రధానముగాఁ గలది అవ్యయీభావము. మధ్యేసముద్రము, మీఁగాలు, పెడతల.

ఏ పదముయొక్క యర్థము క్రియతో నన్వయించునో, ఆపదము యొక్కయర్థము ప్రధాన మనఁబడును. పూర్వపదార్థ మనఁగా మొదటిపదముయొక్క యర్థము.

7. ద్వితీయాదివిభక్తులకు మీఁదిపదములతోడి సమాసము తత్పురుషము. ఇందు రెండవపదముయొక్క యర్థము ప్రధానము.

(1) నెలతాల్పు-ద్వితీయాతత్పురుషము.

(2) నెలతక్కువవాఁడు-తృతీయాతత్పురుషము.

(3) దేవరమేలు-చతుర్థీతత్పురుషము.

(4) దొంగభయము-పంచమీతత్పురుషము.

(5) రామునియిల్లు-షష్ఠీతత్పురుషము.

(6) మాటనేర్పరి-సప్తమీతత్పురుషము.

8. విశేషణమునకు విశేష్యముతోడి సమాసము కర్మధారయము. ఇందుఁగూడ రెండవపదముయొక్క యర్థమే ప్రధానము. నీలోత్పలము, నల్లగుఱ్ఱము, వేఁడినీరు.

9. ఉపమానము పూర్వపదముగాఁ గలది ఉపమానపూర్వపదకర్మధారయము.

చంద్రమోహానము, చిగురుమోవి.

10. ఉపమానము ఉత్తరపదముగాఁ గలది ఉపమానోత్తరపదకర్మధారయము. హస్తపద్మము. కేలుఁదమ్మి.

11. అవధారణవాచకము పూర్వపదముగాఁగలది అవధారణపూర్వపదకర్మధారయము.

నిశాకాంత, రేవెలఁది, సేనాసముద్రము.

దీనినే రూపకసమాస మని యందురు.

12. కర్మధారయసమాసమున పూర్వపదము సంఖ్యావాచక మయినచో నది 'ద్విగువు' అనఁబడును.

త్రిభువనములు, నలుదైపులు.

13. మిశ్రద్విగువు బహువచనాంతముగ నుండును.

ముప్పిడములు.

ఆచ్ఛికపదములకు వచ్చెడిద్విగువు తెలుఁగుగ నేకవచనాంతముగ నుండును. ముక్కాలు, ముచ్చిచ్చు, ముప్పిసము.

14. కర్మధారయమున ఉత్తరపదము పరమగునపుడు మూఁడుశబ్దమునందలి 'డు' అనుదానికి లోపమును, ఊకారమునకు హ్రస్వమును, మిూఁదిహల్లునకు ద్విత్వమును వచ్చును.

మూఁడు+లోకములు=ముల్లోకములు.

మూఁడు+జగములు=ముజ్జగములు.

15. అన్యపదార్థము ప్రధానముగాఁ గలది బహువ్రీహిసమాసము. అన్యపదార్థమనఁగా, సమాసమునందలి పూర్వోత్తరపదముల యర్థముగాక మఱియొక యర్థము.

ముక్కంటి, పద్మనేత్ర, పీతాంబరుఁడు, దీర్ఘబాహువు, చలివెలుఁగు. మూఁడు+కన్నులు. ఈ రెండును సమాసమునందలి పూర్వోత్తరపదములు. వీని యర్థము గాక, శివుఁడు

అను నర్థమున కిచటఁ బ్రాధాన్యము. ఇట్లే మిగిలినవానికిఁ దెలియవలెను.

16. బహువ్రీహిసమాసమున సమాసాంతకార్యములు చూపఁబడినవి. ముక్కంటి, కడలిరాచూలి, అలరువిల్తుఁడు. మూఁడు+కన్నులు=ముక్కన్ను, అని యుండఁగా కన్ను శబ్దము ఔపవిభక్తికము గాన చివర 'టి' రాఁగా, 'ముక్కంటి' అయినది. ఇట్లే తక్కినవి తెలియునది.

బహువ్రీహి సమాసమున, స్త్రీ చెప్పఁబడినచో ఉపమానవాచకము మీఁది మేను శబ్దమునకు 'బోఁడి' ఆదేశముగా వచ్చును. ననబోఁడి, విరిబోఁడి.

17. ఉభయపదార్థప్రధానము ద్వంద్వము, అనఁగా సమాసము నందలి యన్నిపదముల యర్థము ప్రధానముగాఁ గలది. రామకృష్ణులు, కూరగాయలు, తల్లిదండ్రులు, సీతారామలక్ష్మణులు.

18. ఆచ్ఛికపదములతోఁ గూడిన ద్వంద్వసమాసము నందుఁ బూర్వపదము స్త్రీసమ మగును.

తల్లిదండ్రులు, అన్నదమ్ములు.

19. ఒకానొకచోట ద్వంద్వమునఁ బూర్వపదముతుది నున్న 'ము' వర్ణకము లోపించును.

చుట్టము+పక్కము=చుట్టపక్కములు.

అందము+చందము=అందచందములు.

20. మహద్వాచకములకు మహతీవాచకములకు ద్వంద్వ మగుచోఁ గొన్నిచోట్ల పూర్వపదము తుదియచ్చునకు దీర్ఘము వచ్చును. అన్న+తమ్ముఁడు=అన్నాదమ్ములు.

అక్క+చెల్లెలు=అక్కా చెల్లెండ్రు.

21. సమాసములందలి విభక్తు లన్నియును లోపించును.

రామునియాజ్ఞ, చెట్టుమొదలు. (యొక్కకు లోపము)

22. సమాసములందలి చేతన్, తోడన్, వలనన్, అను వానిలోని (అన్) ఇకార మగును. 'అందు' అనునది 'అందలి' అని యగును.

నాచేతిదెబ్బ, నీతోడినెయ్యము, వానివలనితప్పు, నా యందలి కరుణ మొదలగునవి.

22. సమాసములం దంతటను ద్రుతమునకు లోపము వచ్చును. ఎల్లయంశములు, ఎల్లకాలము.

తలఁబ్రాలు మున్నగువానిలోఁ గొన్నిట లోపము రాదు.

తలఁబ్రాలు, సేసఁబ్రాలు, ఊరఁబంది, ఊరఁబిచ్చుక.

ద్రుతప్రకృతికములు - కళలు

ప్రత్యయముగాఁ గాని, అవ్యయముగాఁ గాని, ఆగమముగాఁ గాని చూపట్టునదియై, ఉకారముతోఁ గూడిన నకారము (ను) ద్రుత మనఁబడును. ద్రుత మనఁగా ద్రవించునది. అనుస్వారముగను, 'న్, ఙ్,' అనురూపములుగ మాఱునది; లేక లోపించునది; గావున దీని కీపేరు వచ్చినది. ద్రుతము అంతమందుఁ గలవి ద్రుతప్రకృతికములు.

ఆంధ్రభాషయందలి పదము లన్నియు ద్రుతప్రకృతికములు కళలు అని రెండువిధములు ద్రుతము చివర లేనిపదములను

'కళ' లని యందురు. తెలుఁగుభాషలో నీ విభాగమును దెలిసి కొనుట ముఖ్యము.

### ద్రుతప్రకృతికములు

విభక్తులలో—ప్రథమావిభక్తి ప్రత్యయములు (డు,ము, వు, లు) కూర్చి, గుఱించి, కయి, పట్టి, యొక్క, అను నీవిభక్తి ప్రత్యయములు గాక మిగిలిన విభక్తి ప్రత్యయములు—
నిన్, నున్, లన్, చేతన్, చేన్, తోడన్, తోన్, కొఱకున్, వలనన్, కంటెన్, కిన్, కున్, లోన్, లోపలన్, అందున్, నన్.
సమాపకక్రియలలో—ఉత్తమపురుషైక వచనములు—వండుచున్నాను, వండితిని, వండఁగలను, వండుదును, వండను.
భూతతద్ధర్మార్థకప్రథమపురుషైక వచనములు—
పాడెను, పాడును, పాడెడున్, పాడెడిన్.
ఆశీరాద్యర్థకము లయిన 'ఎడున్, తన్, అను ప్రత్యయములు-
కలిగెడున్, కలుగుతన్.
అసమాపకక్రియలలో—శత్రర్థకము, తుమున్నర్థకము, ఆనంతర్యార్థకము, చేదర్థకము—పాడుచున్, పాడన్, పాడఁగన్, పాడుడున్, పాడినన్.
సర్వనామములలో—నేను, తాను, అనుపదములు.
అవ్యయములలో—ఎల్లన్, ఇఁకన్, ఇఁగన్, ఎట్టకేలకున్, పోలెన్, వలెన్, కైవడిన్, ఒండెన్, క్రమ్మఱన్, పిదపన్, గ్రక్కునన్, కావునన్—మొదలగునవి, ద్రుతప్రకృతికములు.

### కళలు

విభక్తులలో—ప్రథమావిభక్తి ప్రత్యయాంతములు-
రాముఁడు, వనము, విష్ణువు, పొలములు, ఓరాముఁడ, వనితలార,

కూర్చి, గుఱించి, కయి, పట్టి, యొక్క అను విభక్తిప్రత్యయములు.

సమాపకక్రియలలో—సి, ను, అను ప్రత్యయములు చివరలేనివి—వండుచున్నాము, వండితిరి, వండుచున్నావు, వండుచున్నారు, వండవు, వండను, వండుము, వండకుము.

అసమాపకక్రియలలో—క్త్వార్థక, వ్యతిరేకక్త్వార్థకములు. వండి, వండక.

అవ్యయములలో — కటకటా, అయ్యో, ఇంచుక, కొంచెము, బళి, బాపురే, ఔర, ఆహా, అప్పుడు, ఇప్పుడు, ఏమి అ, ఆ, ఏ మొదలగునవి.

ఆశీరాద్యర్థకమగు 'కాక' ఇచ్చుఁగాక—మున్నగునవి కళలు.

సంధులు

పదము లొకటితో మఱియొకటి కలియునప్పుడు కలిగెడి రూపభేదము సంధి యనఁబడును. తెలుఁగులో సంధి యనఁగా మొదటిపదము తుదియచ్చు పోయి రెండవపదము మొదటి యచ్చు నిలుచుటయే.

రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు.

'రాముఁడు' అనుపదమునందలి 'డు' లోని ఉకారము పోయి, అతఁడులోని అకారము నిలిచెను.

కొన్ని సంధులు నిత్యముగాను, కొన్ని వికల్పముగాను వచ్చును. నిత్యముగా వచ్చువానికి నియతసంధులు అని పేరు

వికల్పముగా వచ్చువానికి అనియతసంధులు, అనిత్యసంధులు, వికల్పసంధులు అని పేరు. సంధి లేనిచోట అచ్చు తరువాత నచ్చున్నచో నడుమ యకారము ఆగమముగా వచ్చును. మా+ఇల్లు=మా+య్+ఇల్లు=మాయిల్లు. ఏ+ఊరు=ఏ+య్+ఊరు=ఏయూరు మొదలగునవి.

1. అకారసంధి— అకారమునకు అచ్చుపరమగునప్పుడు సంధి బహుళముగా వచ్చును.

మేన+అత్త మేనత్త, మేనయత్త.

ఇచట బహుళ మనుటచే స్త్రీవాచకశబ్దములకు, తత్సమశబ్దములకు, సంబోధనాంతములకు సంధి లేదు.

స్త్రీవాచక—సెలంత+ఇచ్చెను=సెలంతయిచ్చెను.
తత్సమ—హంస+ఇదిగో=హంసయిదిగో.
సంబోధన—రాముఁడ+ ఇమ్ము=రాముఁడయిమ్ము.

2. ఆకు అన్న మున్నగు శబ్దములు పరమగునపుడు కొన్నిచోట్ల అకారమునకు సంధి నిత్యముగ వచ్చును.

చింత+ఆకు=చింతాకు. రామ+అన్న=రామన్న. చిన్న+అయ్య=చిన్నయ్య. సీత+అమ్మ=సీతమ్మ.

3. ఇకారసంధి—మధ్యమపురుషక్రియలయందలి యికారమునకు సంధి వికల్పముగా వచ్చును.

ఏలితివి+అతని=ఏలితివని. కొట్టితిరి+అపుడు=కొట్టితిరపుడు.

4. ప్రథమోత్తమపురుషక్రియలయందలి యికారమునకును, ఏమి మున్నగుపదములందలి యికారమునకును సంధి వికల్పముగా వచ్చును.

వచ్చిరి + అపుడు=వచ్చిరపుడు, వచ్చిరియపుడు.
వచ్చితిమి + అపుడు=వచ్చితిమపుడు, వచ్చితిమియపుడు.
ఏమి + అంటివి = ఏమంటివి, ఏమియంటివి.
మఱి + ఏమి=మఱేమి, మఱియేమి.
వానికిన్ + ఇచ్చితిని=వానికిచ్చితిని, వానికినిచ్చితిని.

ఏమి, మఱి, కిన్, (షష్ఠీ విభక్తి) అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి, ఇవి ఏమి మున్నగునవి. సంధి వచ్చినపుడు 'కిన్' అనుదానిలోని నకారము లోపించును. సంధి రానపుడట్లే యుండును.

5. తక్కినచోటులందు ఇకారమునకు సంధి రాదు.
వచ్చి+ఇచ్చెను=వచ్చియిచ్చెను. హరి+అతఁడు=హరియతఁడు.

6. ఉకారసంధి—ఉకారమునకచ్చు పరమగునపుడు సంధి నిత్యముగ వచ్చును.

రాముఁడు + ఎక్కడ=రాముఁడెక్కడ.
నేను+ఉంటిని=నేనుంటిని.

7. ద్వితీయాది విభక్త్యులందున్న ఉకారమునకును, శత్రర్థక చువర్ణమునందలి ఉకారమునకును సంధి వికల్పముగా వచ్చును. ఉకారమునకుఁ దరువాత నున్న నకారము సంధి వచ్చునపుడు లోపించును; రాకున్న నట్లే యుండును.

నన్నున్ + అడిగె = నన్నడిగె, నన్ను నడిగె.

నాకొఱకున్ + ఇచ్చె = నాకొఱకిచ్చె, నాకొఱకు నిచ్చె.

నాకున్ + ఆదరువు = నాకాదరువు, నాకు నాదరువు.

నాయందున్ + అణఁకువ = నాయందణఁకువ, నాయందు నణఁకువ.

చూచుచున్ + ఉండెను = చూచుచుండెను, చూచుచు నుండెను.

8. నన్ను, నిన్ను, తన్ను, తమ్ము, మమ్ము, మిమ్ము లకు ద్విత్వ లోపము వచ్చినపుడు సంధి రాదు.

నను నేలె, మిము నడిగె, మము నాజ్ఞాపించె.

9. ఆమ్రేడితసంధి—ఆమ్రేడితము పరమగునపుడు, అచ్చు లకును సంధి వచ్చును. ఒకపదము రెండుమాఱులు ఉచ్చరింపఁబడునపుడు రెండవరూపము 'ఆమ్రేడిత' మనఁబడును.

ఆహా + ఆహా = ఆహాహా. ఓహో + ఓహో = ఓహోహో.
ఔర + ఔర = ఔరౌర.

10. ఆమ్రేడితము పరమగునపుడు విభక్తికి లోపము బహుళముగా నగును.

అక్కడన్ + అక్కడన్ = అక్కడక్కడన్, అక్కడ నక్కడన్.
అప్పటికిన్ + అప్పటికిన్ = అప్పటప్పటికిన్, అప్పటి కప్పటికిన్.

బహుళ మనుటచే, ఆమ్రేడితము పరమగునపుడు 'ఇంచుక, నాఁడు' మున్నగు శబ్దముల తుదియక్షరము వికల్పముగా లోపించును.

ఇంచుక + ఇంచుక = ఇంచించుక, ఇంచుకించుక.
నాఁడు + నాఁడు = నానాఁడు, నాఁడునాఁడు.

11. 'అందదుకు' మొదలగు శబ్దములు ప్రయోగానుసారముగ నెఱుఁగవలయును.

అదుకులు+అదుకులు = అందదుకులు. ఊఁతలు + ఊఁతలు=ఉఱ్ఱూఁతలు.

చెదరు+చెదరు=చెల్లాచెదరు.

తుమురు+తుమురు= తుత్తుమురు, మున్నగునవి.

12. <u>ప్రకృతిప్రత్యయసంధి</u>— పరిమాణార్థమునందువచ్చెడి'ఎఁడు' ప్రత్యయము పరమగుచో సన్నియచ్చులకు సంధి నిత్యముగా వచ్చును.

వీసె+ఎఁడు=వీసెఁడు. మూర+ఎఁడు=మూరెఁడు.

'ఎఁడు' అనునది పరమగుచో 'దోసిలి' మున్నగు వాని లోని 'లి' లోపించును. దోసిలి+ఎఁడు=దోసెఁడు.

13. పూరణార్థమునందు వచ్చెడి 'అవ' పరమగుచో సన్నియచ్చులకు సంధి నిత్యముగా వచ్చును.

రెండు+అవ=రెండవ. ఎనిమిది+అవ=ఎనిమిదవ.

14. <u>గసడదవాదేశసంధి</u> — ప్రథమావిభక్తిమీఁది కచటతప లకు వరుసగా గసడదవలు బహుళముగ నగును. 'ౘ' అనుదానికిఁ గూడ సకార మగును.

వాఁడు+కొట్టె=వాఁడుగొట్టె, వాఁడుకొట్టె.

అతఁడు+చేరెను=అతఁడుసేరెను, అతఁడు చేరెను.

అతఁడు+చనియె=అతఁడు సనియె,అతఁడు చనియె.

ఆమె+తగవరి=ఆమె దగవరి, ఆమె తగవరి.

అతఁడు+పలికె=అతఁడు వలికె, అతఁడు పలికె.

15. ద్వంద్వసమాసమునం దీయాదేశము నిత్యముగా వచ్చును. కూరలు+కాయలు=కూరగాయలు. ఇట్లే కాలుసేతులు; టక్కుటెక్కులు, అన్నదమ్ములు, ఊరువల్లెలు.

16. సరళాదేశసంధి— ద్రుతప్రకృతికముమీఁది 'కచటతప' లకు 'గజడదబ' లు నిత్యముగా వచ్చును. అప్పుడా ద్రుతమునకు బిందువు 'అర్ధానుస్వారము, లేక పూర్ణానుస్వారము'గాని, సంశ్లేషము (మీఁదిహల్లుతోఁ గలియుట) గాని, స్వత్వము (ద్రుతము మాఱకుండుట) గాని యగును.

పూచెను+కమలము=పూచెంగమలము, పూచెఁగమలము, పూచెనుగమలము, పూచెన్గమలము, పూచెనుగమలము. వచ్చెను+చక్రి=వచ్చెంజక్రి, వచ్చెఁజక్రి, వచ్చెన్జక్రి, వచ్చెను జక్రి. పూసెను + టక్కులు = పూసెండక్కులు, పూసెఁడక్కులు, పూసెన్డక్కులు, పూసెను డక్కులు.
విరిసెను+తమ్మి=విరిసెందమ్మి, విరిసెఁదమ్మి, విరిసెన్దమ్మి విరిసెనుదమ్మి.

పూచెను+పద్మము=పూచెం బద్మము, పూచెఁ బద్మము, పూచె న్బద్మము, పూచెను బద్మము.

17. ద్రుతమునకు సరళములుగాని, స్థిరములుగాని పరమగునపుడు—లోపముగాని సంశ్లేషముగాని స్వత్వముగాని యగును. వచ్చెను+గజము=వచ్చెగజము, వచ్చెన్గజము, వచ్చెనుగజము. తెచ్చెను+ఖడ్గము=తెచ్చెఖడ్గము, తెచ్చెన్ఖడ్గము, తెచ్చెను ఖడ్గము.

18. ద్రుతము పై నచ్చు నిలుచునప్పటి కార్యములు-ద్రుతమున కచ్చు పరమగుచో ద్రుతములోనియచ్చు పోయి మిగిలిన నకారము తరువాతియచ్చుతోఁ గలియును.

వానిని+అడిగెను=వాని నడిగెను. కొడుకును+ఊరడించెను=కొడుకు నూరడించెను.

అచ్చు పరమగుచో నొక్కొక్కచోట ద్రుతమునకు ద్విత్వము వచ్చును. అన్నియును+ఏని అన్నియున్నేని.

19. అవసానద్రుతకార్యములు—ద్రుతములోనియచ్చు వాక్యముచివర నొక్కొక్కప్పుడు పోవును. వాఁడు నన్నుఁ జూచెన్, వాఁడు నన్నుఁ జూచెను. నేను నిన్నుఁ జూచితిన్, నేను నిన్నుఁ జూచితిని.

20. ద్రుత మంతయు వాక్యముచివర నొక్కొక్కప్పుడు పోవును. వాఁడు నన్నుఁ జూచె, నేను నిన్నుఁ జూచితి.

21. ఈ లోపము పద్యములచివర నున్నపుడు ఛందోనియమముల ననుసరించియుండును. అనఁగా గురువు తుదియందుండవలసివచ్చినచో ద్రుతములోని అచ్చుమాత్రము పోవును.

అతిశయముగ బుద్ధిమంతుఁ డగు బుధసేవన్.

లఘువు తుదియం దుండవలసివచ్చినచో ద్రుతము లోపింపకుండ నుండును, లేదా పూర్తిగా లోపించును. పొల్లు నకారముగా నుండదు.

నాథుఁ డప్పుడు ప్రేమ నన్నుఁ జూచె.
వీరుఁ డంతట సేనాని వెంటఁ జనెను.

✓ 22. పడ్వాదిసంధి—పడు మొదలగునవి పరమగునప్పుడు, ము వర్ణమునకు లోపముగాని పూర్ణబిందువుగాని వికల్పముగా నగును.

భయము + పడు = భయపడు, భయంపడు.

పడు, పెట్టు, పట్టు, పఱచు మొదలగునవి పడ్వాదులు.

23. అనుకృతిసంధి—అనుకరణమున విసర్గమునకు లోపం బగును. త్వమేవ గతిః + అనె = త్వమేవ గతి యనె. వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీయనియె.

24. అనుకరణమున తుదిహల్లునకు ద్విత్వం బగును.

పాయాత్ + అని = పాయాత్తని.

కింతత్ + అనియె = కింతత్తనియె.

అహమాదిశబ్దముల మకారమునకు ద్విత్వము వికల్పముగా వచ్చును. దాసోహమ్ + అనియె = దాసోహమ్మనియె, దాసోహమనియె. ఇదమిత్థమ్ + అనియె = ఇదమిత్థమ్మనియె, ఇదమిత్థ మనియె.

25. అనుకరణమున ఉకారాంత నామవాచకములకు 'వు' అంతాగమముగా వచ్చును.

ఇయం ధేనుః + అనియె = ఇయం ధేనువనియె.

26. త్రికసంధి—'ఆ, ఈ, ఏ' లు త్రికము అనంబడును. అసంయుక్తములైన హల్లులు పరమగునపుడు త్రికంబునకు హ్రస్వమును; మీఁదిహల్లునకు ద్విత్వమును బహుళముగా నగును.

ఆ + కన్య = అక్కన్య. ఈ + పుస్తకము = ఇప్పుస్తకము.
ఏ + కాలము = ఎక్కాలము.

బహుళ మనుటచే, ఊష్మ శేషములు పరమగునప్పుడీ కార్యము రాదు. ఆశకటము, ఈషండము, ఏ సరోవరము, ఈ రాజు మొదలగునవి.

✓ 27. టుగాగమసంధి— కర్మధారయ సమాసమునందు ఉకారమునకు అచ్చు పరమగుచో 'టు' ఆగమముగా నగును.

కఱకు + అమ్ము=కఱకుటమ్ము. నిగ్గు + అద్దము = నిగ్గుటద్దము. సరసము + అలుక=సరసపుటలుక.

ఈ టుగాగమము ఉకారాంతములు కాని వానికిఁగూడఁ గానఁబడియెడిని.

మిద్దె+ఇల్లు=మిద్దెటిల్లు. దుక్కిటెద్దు, పల్లెటూరు, తేనెటీఁగ.

ఈటుగాగమము షష్ఠీతత్పురుషమునందుఁగూడ నగును.

వేల్పు + ఆవు=వేల్పుటావు. సముద్రపుటొడ్డు.

28. కర్మధారయమునందు పేర్వాదిశబ్దముల కచ్చుపరమగునపుడు టుగాగమము వికల్పముగా నగును.

పేరు+ఉరము=పేరుటురము, పేరురము.

చిగురు + ఆకు=చిగురుటాకు, చిగురాకు.

పొదరు+ఇల్లు=పొదరుటిల్లు, పొదరిల్లు.

✓ 29. ద్విరుక్తటకారాదేశసంధి—కుఱు, చిఱు, కడు, నడు, నిడు శబ్దముల 'ఱ, డ,'ల కచ్చు పరమగునపుడు ద్విరుక్తమైన టకార మాదేశ మగును.

కుఱు + ఉసురు=కుట్టుసురు. చిఱు + ఎలుక=చిట్టెలుక.

కడు + ఆయితము=కట్టాయితము.

నడు+అడవి=నట్టడవి. నిడు + ఊరుపు=నిట్టూరుపు.

30. ఆమ్రేడితము పరమగుచో కడాదులలోని మొదటి వర్ణము మిగిలి, తక్కినవర్ణములకు ద్విరుక్తటకార(ట్ట) మాదేశ మగును.

కడ+కడ=కట్టకడ. తుద+తుద=తుట్టతుద.

కొన, పగలు, బయలు, నడుము, ఎదుట,—ఇవి కడాదులు.

31. దుగాగమసంధి— నీ, మీ, నా, మా, తన తమ శబ్దములకు ఉత్తరపదము పరమగునపుడు 'దు' ఆగమము వికల్పముగ వచ్చును.

నీ+కరుణ=నీదుకరుణ, నీకరుణ. మా+నేరమి=మాదు నేరమి, మానేరమి, తన+కరుణ=తనదుకరుణ, తనకరుణ.

32. రుగాగమసంధి— కర్మధారయమున పేదాదిశబ్దముల కాలుశబ్దము పరమగునపుడు 'రు' ఆగమముగావచ్చును.

పేద+ఆలు=పేదరాలు. బీద+ఆలు=బీదరాలు.

ముద్ద-ముద్దరాలు. జవ-జవరాలు మొదలగునవి.

33. తత్సమశబ్దములకు ఆలు శబ్దము పరమగునపుడు 'రు' ఆగమముగా వచ్చును; వచ్చునపుడు తుది అకారమునకు ఉకారము వచ్చును.

ధీర+ఆలు=ధీరురాలు. గుణవంత+ఆలు=గుణవంతురాలు.

34. పుంప్వాదేశము—కర్మధారయసమాసమునందును, షష్ఠీ తత్పురుషసమాసమునందును మువర్ణమునకు "పు ంపు" అను నవి ఆదేశము లగును.

సరసము + వచనము=సరసపువచనము, సరసంపువచనము. సరసము + అలుక = సరసపుటలుక. విసము + ముద్ద = విసపు ముద్ద, విసంపుముద్ద. సముద్రము + ఒడ్డు = సముద్రపుటొడ్డు.

३५. నుగాగమసంధి — కర్మధారయసమాసమునందు ఉకారాంత స్త్రీసమశబ్దములకును, మువర్ణమున కాదేశముగా వచ్చు పు ంపు లకును పరుషసరళములు పరములగునపుడు 'ను' గాగమ మగును.

ఈ యాగమము ద్రుతము కావున దీనికిఁ బరుషములు పరములగునపుడు బిందుసంశ్లేషములును, సరళస్థిరములు పరము లగునపుడు లోపసంశ్లేషములును వచ్చును. స్వాత్వము రాదు.

చిగురు + కైదువు = చిగురుఁగైదువు, చిగురుంగైదువు, చిగురుగైదువు.

సరసము + తనము=సరసంపుఁదనము, సరసంపుందనము సరసంపుదనము.

సరసము + గుణము=సరసపుగుణము, సరసపుగుణము.

ఈ యాగమము తన వర్ణకము పరమగునపుడు అకారాంత విశేషణములకును వచ్చును.

తెల్ల + తనము= తెల్లఁదనము, తెల్లందనము, తెల్లదనము.

३६. తద్ధర్మార్థవిశేషణములందలి ఉకారమునకును, షష్ఠీసమాసమునందలి ఉకార ఋకారములకును అచ్చు పరమగునపుడు ను' గాగమ మగును.

చేయు + అతఁడు = చేయునతఁడు. చేసెడు + అతఁడు = చేసెడునతఁడు. రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ. విధాతృ + ఆనతి= విధాతృనానతి.

37. ప్రాఁతాదిసంధి—సమాసములందు ప్రాఁత, మొద లగు శబ్దముల మొదటియచ్చునకు మీఁదనున్న వర్ణము లన్నిటికిని లోపము వికల్పముగా వచ్చును.

ప్రాఁత+ఇల్లు=ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు.

లేఁత+దూడ=లేదూడ, లేఁతదూడ.

పూవు+బంతి=పూబంతి, పూవుబంతి.

లోపింపఁగా మిగిలినదానికి పరుషసరళములు పరమగునప్పుడు 'ను' ఆగమముగా వచ్చును.

ప్రాఁత+కెంపు=ప్రాఁగెంపు, ప్రాఁతకెంపు.

వేఁగు+పోక=వేఁబోక, వేఁగుఁబోక.

కాను+తీఁగ=కాఁదీఁగ, కానుతీఁగ.

ఈ నుగాగమము కొన్నిచోట్ల నిత్యముగా వచ్చును.

మీఁదు+కడ=మీఁగడ. చెన్ను+తోవ=చెందోవ.

38. క్రొత్తశబ్దమునకు మొదటియక్షరము మిగులఁగా, కొన్నిచోట్ల నుగాగమమును, కొన్నిచోట్ల మీఁదిహల్లునకు ద్విత్వము నగును.

క్రొత్త+పసిఁడి=క్రొంబసిఁడి. క్రొత్త+కారు=క్రొక్కారు.

క్రొత్త+చాయ=క్రొంజాయ.

క్రొత్త+మెఱుఁగు=క్రొమ్మెఱుఁగు.

39. క్రిందుశబ్దమున కాద్యక్షరశేషంబునకు, పరుషసరళములు పరము లగునపుడు దీర్ఘము వచ్చును.

క్రిందు+కడుపు=క్రీఁగడుపు. క్రిందు+కాలు=క్రీఁగాలు.

ఈలోపమును, నుగాగమమును, ద్విత్వమును, ఇతర శబ్దములమీఁద సైతము కానఁబడుచున్నది.

పది + తొమ్మిది = పందొమ్మిది. నెఱ + మది = నెమ్మది.

పంక + చెఱఁగు = పంజెఱఁగు. నెఱ + వడి = నెవ్వడి.

40. వాక్యాంతసంధివిశేషములు—వాక్యాంతమునందు సంధి వికల్పముగా వచ్చును.

అన్న పండు తెచ్చెను; అది నా కెంతయు నిష్టము.

అన్న పండు తెచ్చె; నది నా కెంతయు నిష్టము.

41. పద్యములలోఁ బాదాంతమున వాక్య మంత మైనచో, సంధి మానివేయవచ్చును.

గీ. సర్వతీర్థాభిగమనంబు సర్వవేద
సమధిగంబును సత్యంబునకును గావు
ఎఱుఁగు మెల్లధర్మంబుల నెందుఁ బెద్ద
యండ్రు సత్యంబు ధర్మజ్ఞు లైన మునులు.

పాదమధ్యంబున వాక్యాంత మైనచో సంధి చేసితీరవలెను.

నీ విటుండుము అచటికి నేను గూర్తు.

సంస్కృతసంధులు.

౧. సవర్ణదీర్ఘసంధి—అ, ఇ, ఉ, ఋ; అను వర్ణములకు క్రమముగ సవర్ణము పరమగునపుడు రెండిటికి బదులు వానిదీర్ఘము ఆదేశముగ వచ్చును.

రామ + అనుజుఁడు = రామానుజుఁడు.

చంద్ర + అస్త్ర = చంద్రాస్త్ర.

రమా + ఆరాధనము=రమారాధనము.

కవి + ఇంద్రుడు=కవీంద్రుడు.

గౌరీ + ఈశుడు=గౌరీశుడు.

గురు + ఉపదేశము=గురూపదేశము.

వధూ + ఊహాలు=వధూహాలు.

పితృ + ఋణము=పితౄణము.

౨. గుణసంధి—అకారమునకు, 'ఇ, ఉ, ఋ' లు పరమగు నపుడు వరుసగా 'ఏ ఓ, అర్' లు ఆదేశముగ వచ్చును.

దేవ + ఇంద్రుడు=దేవేంద్రుడు. రమా + ఈశుడు= రమేశుడు. పరమ + ఈశ్వరుడు = పరమేశ్వరుడు. చంద్ర + ఉదయము=చంద్రోదయము. గంగా + ఊర్మిలు=గంగోర్మిలు. కృష్ణా + ఉదకము=కృష్ణోదకము. పరమ + ఊష్మము=పరమోష్మము. దేవ + ఋషి=దేవర్షి, దేవఋషి. వసంత + ఋతువు= వసంతర్తువు. వసంతఋతువు.

3. వృద్ధిసంధి—అకారమునకు 'ఏ ఐ, ఓ ఔ' లు పరమగు నపుడు 'ఐ, ఔ' లు ఆదేశమగును.

జన + ఏకత్వము=జనైకత్వము

మహా + ఐశ్వర్యము=మహైశ్వర్యము.

నాక + ఓకసులు=నాకౌకసులు.

దేశ + ఔన్నత్యము=దేశౌన్నత్యము.

గంగా + ఓఘము=గంగౌఘము.

౪. యణాదేశసంధి—‘ఇ, ఉ, ఋ’ లకు అచ్చు పరమగు నపుడు వరుసగా ‘య్; వ్; ర్’ అనునవి ఆదేశముగ వచ్చును.

అతి + ఆదరము = అత్యాదరము.

విష్ణు + ఆలయము = విష్ణ్వాలయము.

పితృ + అంశము = పిత్రంశము.

౫. అనునాసికసంధి—వర్గములలోని యక్షరములకు అనునాసికవర్ణము పరమగుచో, వానివాని యనునాసికవర్ణము ఆదేశముగ వచ్చును. వాక్ + మయము = వాఙ్మయము. చిత్ + ముద్ర = చిన్ముద్ర. రాట్ + మణి = రాణ్మణి.

---

# ఛందస్సు

ఛందస్సనునది భారతీయవాఙ్మయమున వేదకాలము నాఁటినుండియుఁ బ్రసిద్ధమై గణన కెక్కినది. వేదవాఙ్మయమునఁ బ్రసిద్ధమైయున్న ఛందము నూఁతగఁ గొనియే పురాణవాఙ్మయమును, కావ్యవాఙ్మయమును గణయతివృత్తాదినియమనిబద్ధమై యెసలారినవి.

సంస్కృతవాఙ్మయమున ఆదికావ్యకర్త యని ప్రఖ్యాతుఁడైన వాల్మీకిమహర్షినోట నప్రయత్నముగ ఛందోమయమైన కరుణరసాక్రందనము శ్లోకరూపమున బయలుదేఱినది. శ్లోకరూపమైన యాశ్లోకమే రామాయణమహాకావ్యనిర్మాణమునకుమూలమై రసికజనహృదయములను రసవీచుల నోలలా

డించినది. దాని నాధారముగఁ గొనియే కాళిదాసాది మహా
కవులు ఛందోబంధమధురములై రసపరిపుష్టములైన కావ్య
ములను రచింపఁగల్గిరి. ఇట్లీఛంద స్సనునది కావ్యమున కాధా
రము నలంకారము నగుచున్నది.

ఛందోబద్ధముగాని వాక్యమును గద్య మని వ్యవహరిం
తురు. ఛందోబద్ధమైన వాక్యమును పద్యమందురు. పద్యము
గానమున కనువుగ నుండును. తాళయాదులకును సరిపడియుం
డును. సాధారణవాక్యముకంటె సంగీతముతో మేళవించినవా
క్యము శ్రుతిమధురముగను, హృదయాకర్షకముగను నుండును.
గద్యముకన్న పద్యము మనస్సులో శీఘ్రముగా నాటుకొని,
వలయునపుడు జ్ఞాపకము తెచ్చుకొనుట కనువుగ నుండును.
కావుననే ఛందోబద్ధమైన వాణి యవినాశియై యనేకుల రసనా
రంగముల నర్తించుచున్నది.

పద్యభేదములు —పద్యములు మూఁడువిధములు.

1. వృత్తములు. 2. జాతులు. 3. ఉపజాతులు.

1. ఉత్పలమాల, చంపకమాల, శార్దూలము, మత్తేభము, మత్తకోకిల, ఉత్సాహము, పంచచామరము మొదలగునవి వృత్తములు.
2. కందము మొదలగునవి జాతులు.
3. తేటగీతి, ఆటవెలఁది, సీసము మొదలగునవి ఉపజాతులు. కి.

### గురులఘులక్షణము

హ్రస్వాచ్చులు వానితోఁగూడిన హల్లులు లఘువు
లనఁబడును, అ, ఇ, ఉ, క, గి, రు. లఘువునకు గుర్తు—

దీర్ఘాచ్చులు, వానితోఁగూడిన హల్లులును, సంయుక్తా క్షరమునకుఁ బూర్వమందున్నవియు, 'నిండుసున్న, విసర్గము, పొల్లుహల్లు' వీనితోఁ గూడినవియు, 'గురువు' లనఁబడును, ఆ, ఈ, కా, టీ, దే, కుక్క, ధర్మము, తం, దుః, నన్.

ఇందు లఘువునకు 'ల' అనియు, గురువునకు 'గ' అనియు సంకేతములు. గురువునకు గుర్తు — ∪ 1

విసర్గగణములు.

ఇవి రెండు మూఁడు వర్ణములతో నేర్పడును. వానిలో రెండువర్ణములుగలవి నాలుగు—

రెండును గురువు లయిన 'గగము' లేక 'గా'. ∪∪

రెండును లఘువు లయిన 'లలము' లేక 'లా'. ||.

మొదటిది గురువు రెండవది లఘువు నయిన 'గలము' లేక 'హ'. ∪|.

మొదటిది లఘువు, రెండవది గురువునయిన 'లగము' లేక 'వ'. |∪.

మూఁడువర్ణములు గల గణములు ఎనిమిది.

మొదట గురు వుండిన భగణము. ∪||.

మధ్య గురు వుండిన జగణము. |∪|.

చివర గురు వుండిన సగణము. ||∪.

మొదట లఘు వుండిన యగణము. |∪∪

మధ్యలఘు వుండిన రగణము. ∪|∪.

చివర లఘు వుండిన తగణము. ∪∪|.

మూఁడును గురువు లుండిన మగణము. U U U.
మూఁడును లఘువు లుండిన నగణము. । । ।.

వీనికే నిసర్గగణము లనియు, మాతృగణము లనియుఁ బేరు. వృత్తములలో నీగణములే వాడఁబడును.

### చతుర్మాత్రాగణములు.

పైనిఁ జెప్పిన మూఁడక్షరములగణములకు ఒకలఘువునుగాని, గురువునుగాని చేర్చినచో వేర్వేఱు గణము లేర్పడును.
నగణమునకు లఘువును జేర్చిన 'నలము'— । । । ।.
నగణమునకు గురువును జేర్చిన 'నగము'=। । । U.
సగణమునకు లఘువును జేర్చిన 'సలము'—। । U ।.

లఘువున కొక్కమాత్ర యనియు, గురువునకు రెండుమాత్ర లనియు, నిర్ణయము. రెండువర్ణములు గల గణములలో 'గగము'నకును, మూఁడువర్ణములు గల గణములలోని 'భ, జ, స,'లకును నాలుగువర్ణములు గల గణములలో 'నలము'నకును నాలుగేసి మాత్రలు. కనుక నీ 'గా, భ, జ, స, నలము'ల కయిదింటికిని 'చతుర్మాత్రాగణము'లని పేరు. కందము మొదలగు జాతులం దీచతుర్మాత్రాగణములే వాడఁబడును.

### ఇనగణములు.

నగణము హగణము (గలము) ఈ రెండును ఇనగణములు లేక సూర్యగణములు.

### ఇంద్రగణములు

నల, నగ, సల, భ, ర, త, లు ఇంద్రగణములు. ఈయినగణములకును, ఇంద్రగణములకును ఉపగణములని కూడఁ బేరు. ఇవి తేటగీతి సీసము మున్నగు నుపజాతులలో వాడఁబడును.

### యతులు - ప్రాసములు.

పై గణములచే నేర్పడువృత్తములందును జాత్యుపజాతుల యందును యతులను ప్రాసములను దెలుఁగు కవులు చిరకాలమునుండియుఁ బాటించుచువచ్చిరి. సంస్కృతకవిత్వములో యతి యనఁగా పద్యపాదములో నియతమైనచోట పదమును బూర్తిచేయుట, ఇది పద్యము చదువునపుడు గ్రుక్కవిడుచుట కుపయోగించును. కావుననే "పదవిచ్ఛేదము యతి" యని సంస్కృతలాక్షణికు లనుశాసనము చేసియున్నారు. పదసమాప్తి మునమాత్రము సంస్కృతకవితలో యతి యుండదు.

తెలుఁగుకవులు మఱియొకవిధమైన యతి సంగీకరించి యున్నారు. వీరు పద్యపాదమునందలి మొదటివర్ణమును 'వళి' యనియు, దానితో మైత్రిగలవర్ణమును యతిస్థానమునఁ జేర్ప వలయు ననియు, ననుశాసనము చేసియున్నారు. యతిస్థానమున పదము పూర్తిగావలె ననునియమము వీరికి లేదు. పదమధ్యమునందును యతి యుండవచ్చును.

ఇట్టియతి తొలుతఁ బద్యముల కలంకారమాత్రముగనే యుండినను క్రమముగ లక్షణముగా మాఱినది. అనఁగా

నీయతిని పాటింపకుండుట దోష మని తలఁచిరి. ఈ యతికే విశ్రాంతి, విరతి, విశ్రమము, విరామము, విరమణము మున్నగు నవి పర్యాయపదములు.

పద్యపాదమున రెండవయక్షరము ప్రాసము. సంస్కృత కవితలోఁ బ్రాసమున కంతగఁ బ్రాధాన్యము లేదు. తెలుఁగు కవితలో యతిప్రాసములు రెండును పద్యమున నాల్గుపాదము లందును నియతముగ నుండవలయును. యతికి స్వరమైత్రియుఁ బ్రాసమునకు వ్యంజనమైత్రియుఁ బ్రధానములు. ప్రాసమునకుఁ బూర్వము మొదటిపాదమున గురు వున్న మిగిలినమూఁడు పాదములందును గురువే యుండవలయును. లఘు వున్న లఘువే యుండవలయును.

ప్రాసము, మొదట, పద్యమున కలంకారరూపముగ నవతరించి, క్రమముగ లక్షణములలో నొకటిగ వెలసినది. ఇట్లే యతిప్రాసములు రచనకు మాధుర్యమును గలిగించుచు, శబ్దస్వరూపనిర్ణయమునకు సాధనములై, తెలుఁగుకవితలో ముఖ్యస్థానమును వహించినవి. ఈ విషయమును కొఱవి గోపరాజకవి తన 'సింహాసనద్వాత్రింశిక'లో నిట్లు వాకొనియున్నాఁడు.

"ఆంధ్రమండలంబువం గోణదేశంబునఁ దెలుంగుఁగవిత కుఁ బ్రాలు వళ్ళు నను నియమంబులు చూచినాఁడ; వవి యెఱ్ఱుంగం దఱుచుఁ గానరాకుంట నపూర్వం బవధరింపుము.

శా. పుణ్యస్త్రీకి గుణంబు మంగళగుణంబు ల్సొమ్ములై
యొప్పంగాఁ
బణ్యస్త్రీకి సువర్ణమౌక్తికసుమాపవ్యక్తి భూషావళుల్
గణ్యంబౌ గతి, సంస్కృతంబునకు వాగ్భావంబు శబ్దంబు లా
వణ్యాకారములౌఁ; దెనుంగునకుఁ బ్రాల్యాళ్యం గడు
న్యాస్నియల్.

క. తప్పక వళ్ళును బ్రాలును
ముప్పిరిగొనఁదగిన శబ్దములు మెఱుఁ గెక్కన్
జెప్పినఁ గవితాచాతురి
యొప్పము వెట్టిన పసిండిసొమ్మున మెఱయున్."

ఈ ప్రసంగమునుబట్టి యతిప్రాసములు కవిత కలంకార ములై వన్నెవెచ్చు నని తెలియుచునే యున్నది.

కన్నడభాషలో యతిలేదు. ప్రాస మున్నది. అఱవము లోఁ దెలుఁగునందలి యతివంటిది గలదు. దానిని 'మోనై' యందురు. అఱవమున ప్రాసమునకు 'యదుకై' అని యం దురు. ఈ యతిప్రాసనియమ ముండుటచేతనే తెలుఁగుకవులకుఁ గొంత క్లేశ ముండును. కాని భాషలో సిద్ధహస్తుఁడైన కవి కిది నిర్బంధము కలిగింపదు. రచన కివియలంకారములై వన్నెఁ దెచ్చును. నన్నయభట్టారకుని వృత్తములు శ్రీనాథుని సీస ములు యతిప్రాసనియమనిబద్ధములై, రసజ్ఞుల కానందమును, లాక్షణికుల కాహ్లాదమును గలిగించుచు నాంధ్రకవుల కాదర్శ ప్రాయముగ నున్నవి.

## యతి మైత్రి

1. అ, ఆ, ఐ, ఔ, య, హ.
2. ఇ, ఈ, ఋ, ౠ, ఎ, ఏ.
3. ఉ, ఊ, ఒ, ఓ.
4. క, ఖ, గ, ఘ.
5. చ, ౘ, ఛ, జ, ౙ, ఝ.
   శ, ష, స.
6. ట, ఠ, డ, ఢ.
7. త, థ, ద, ధ.
8. ప, ఫ, బ, భ.
9. ల, ళ, డ.
10. న, ణ.

వర్ణోత్పత్తిస్థానముల సామ్యమునుబట్టి సాధారణముగ నీయతిమైత్రి చెల్లుచుండును. కాని కొన్ని వర్ణములవిషయమున విశేషలక్షణములు పాటింపఁబడుచు వచ్చినవి. ర-ఱ, ల-ళ, అను నక్షరములకుఁ బరస్పరము యతి చెల్లుటవిషయమున లాక్షణికులలో నభిప్రాయభేదములు పెక్కులు గలవు.

### యతిభేదములు

ఈ యతులు స్వరయతులు, వ్యంజనయతులు, ఉభయ యతులు, ప్రాసయతులు నని ప్రధానముగ నాల్గువిధములు.
స్వరయతి—అ ఆ ఐ ఔ లకును, ఇ ఈ ఋ ౠ ఎ ఏ లకు ను, ఉ ఊ ఒ ఓ లకును పరస్పరము యతి చెల్లుట.

అబ్జమిత్రనేత్ర ఆర్తావనచరిత్ర
ఆత్తతాయిజైత్ర ఐంద్రమిత్ర
ఐంద్రవద్రగోత్ర ఔర్వాశేయస్తోత్ర.

ఈ యచ్చు తేయేహల్లులతోఁ గూడియున్నను విఱుగు నవియే కావలెను. వీనిలో హల్మైత్రి యక్కఱలేదు.

ఇంతయేల, యనుచు నగవ మాటె నంబుజాక్షి.

అచ్చులు సంధివశమున మఱియొకయచ్చుతోఁ గలిసిన చోట రెండవయచ్చునుబట్టియే యతి చెప్పవలెను.

లంక + ఈశజైత్ర=లంకేశజైత్ర యనునపు డీకా రముతోడనే యతిమైత్రి.

వ్యంజనయతి:—(ప్రాణియతి.) విఱుగని హల్లులకు విఱుగని హల్లులతోఁ బరస్పరము యతి చెల్లిన వ్యంజనయతి.

కాళియోరగవైరి కైటభారి.

ఇందు అచ్చులకుఁగూడ మైత్రి యావశ్యకము.

వర్గయతి, బిందుయతి, పోలికయతి, సరసయతి అభేదయతి, సంయుక్తాక్షరయతి—అని వ్యంజనయతి ఆఱువిధములు.

1. ప్రతివర్గమునందును చివరివర్ణము తప్ప మిగిలిన వర్ణములకుఁ బరస్పరము యతి చెల్లిన వర్గయతి.

ఖంజనాభగేహ గ్రాసమోహ.

2. వర్గములలోని యక్షరములు పూర్ణబిందువుతోఁగూడి, ఆ యావర్గమునందలి తమతమ యనునాసికవర్ణములతో యతి మైత్రికిఁ జెల్లిన బిందుయతి.

నాదు మొఱ నాలకింపఁ డెంత్రె యును గినిసి·

3. 'ము' తో పు,ఫు,బు, 'భు' లకు యతి చెల్లిన పోలికయతి.

ఫుల్లవంకేరుహాము వక్త్రిముగ నొనర్చి.

4. 'అ య హా' లకు 'చ ఛ జ జ ఝ శ ష స' ల లకు, న ణ లకుఁ బరస్పరము యతి చెల్లిన సరసయతి.

హరిహయాదిసురారాధ్యక, అంబుజాక్ష.
యతిజనమనోంబుజవిహార అఘవిదూర
నరకదైత్యవిరోధి ఘృణాపయోధి,
శకటదానవసంహారి చక్రధారి,
షట్పదశ్యామమూర్తి స్వేచ్ఛావిహారి,
సర్వకల్యాణదాయి భుజంగశాయి,
కరుణ ననుఁ బ్రోవు మన నయ్యె సరసవళులు.

అకారమునకు 'హయ' లతోనేగాక, ఇ, ఉ అనువానికిం గూడ వాని మిత్రములగు నచ్చులతోఁ గూడిన యకారహకారములతోను యతి పొసఁగును. ఇ=యి, హి, యె, హె మున్నగునవి. ఉ=యు, హు, యొ, హొ మొదలగునవి. అనఁగా, యకారహకారములతోఁ గూడినయచ్చులు విఱుగకున్నను విఱిగినయచ్చులతో యతి నిల్పవచ్చును.

౫. ప ఫ బ భ లకు వకారముతోను, ల డ లకు ళకారముతోను యతి చెల్లిన అభేదయతి.

వసుమతీశశ్రుత బకజైత్రగావక
ఫాలసత్కలాప డింభగోవ
లలితదేహ పింగళ వురదక్షిణాగేహ
యన నభేదవిరతు లప్రమేయ.

6. సంయుక్తాక్షరయతి—సంయుక్తాక్షరములలో నేవర్ణముతో నైనను యతి చెల్లును. దీనినే సంయుక్తయతి యనికూడ నందురు.

> క్ష్మాధరం బాతపత్త్రింబుగా ధరించె
> క్ష్మాకుమారుని బోరను సంహరించె. మొదలగునవి.

ఉభయయతి—సమాసపదములు విడఁదీయరానియట్లు కూడియుండి, ఒకరూఢ్యర్థమును దెలుపునపుడు, సంధిస్థలము నందలి యచ్చులతోడను హల్లులతోడను యతి చెల్లిన నది 'ఉభయయతి' యగును, జనార్దనుఁడు, నాకము, ద్వీపము, అనేకము, కర్ణాటము, మున్నగు సంస్కృతనిత్యసమాసపదములును, ఉక్కఱ, తెమ్మెర, పెంపఱ, ఓలమాస మున్నగు దేశ్యనిత్యసమాసపదములును నట్టివి. వీనిలో అచ్చులతోడను హల్లులతోడను యతి చెల్లింపవచ్చును. దీనినే 'అఖండయతి' యని యందురు. ఇట్టి పదములందుఁగాక, యిచ్చవచ్చిన పదములందెల్ల అచ్చులతోను హల్లులతోను యతి చెల్లించుట అఖండయతి గానేరదు.

> నగి నగి యేనియుఁ విను జనార్దన...(హల్లుతో)
> అసితశరీరకాంతుల జనార్దన...(అచ్చుతో)
> ఇటులనే తక్కినచోటులం దెఱుంగునది.

ప్రాసయతి—యతికి మాఱుగఁ బ్రాసమునే వాడుట ప్రాసయతి యనఁబడును. ప్రాసనియమము లన్నియు నిట ననుసరింపవలయును.

బోటి యొకతె పెండ్లిపాట పాడఁగఁజొచ్చె.

వృత్తములు.

నిసర్గగణములు గల్గి యతిప్రాసములతోఁ గూడినవానిని ము లందురు.

౯. ఉత్పలమాల—భ, ర, న, భ, భ, ర, వ గణములు. పదషియక్షరమున యతి నిల్చును.

బాల! పదావడిఁ భ ర న భా ర లగంబుల నుత్పలం బగుఁ.

చంపకమాల— న, జ, భ, జ, జ, జ, ర గణములు. పదునొకండవ యక్షరమున యతి.

న జ భ జ జ ల్ జ రేఫలు చనఁ బదునొండిటఁ జంపకం బగున్.

మత్తేభము—స, భ, ర, న, మ, య, వ గణములు. పదునాల్గవ యక్షరమున యతి.

వడి పద్నాలుగిటఁ సభల్ ర న మ యల్ వం బుండ మత్తేభ మౌ.

శార్దూలము—మ, స, జ, స, త, త, గ గణములు. పదుమూఁడవ యక్షరమున యతి.

స్థానం బౌఁ బదుమూఁడిటన్ మ స జ సల్ తాగంబు శార్దూల మౌన్. (స్థానము=యతిస్థానము.)

మత్తకోకిల—ర, స, జ, జ, భ, ర గణములు. పదునొకండవ యక్షరమున యతి.

శ్రాంతియగుం బదునొండిటన్ రసజాభరేఫల మత్తయౌ॥

మాలిని—స, స, మ, య, య గణములు. తొమ్మిదింట యతి.

స, స, మ, య, య యుతంబౌ మాలినిన్ దొమ్మిదింటన్

పంచచామరము—జ, ర, జ, ర, జ, గ గణములు. పదింట యతి.

జరల్ జరల్ జగంబు పంచచామరన్ బదౌ యతిన్.

ఉత్సాహ—హ, న, గణములలో నేదైన నేడును, ఒక గురువును ఉండును. ఐదవగణము మొదటియక్షరమున యతి నిల్చును.

ఊహతో, హ న గణములను నొప్ప నేడు గురువును త్సాహ, గణచతుష్టయంబు చనఁగ యతిని నిల్పఁగన్ పై దానిలోని మొదటిలఘువును దీసివేసిన 'ఉత్సాహ' యగును.

## జాతులు

చతుర్మాత్రాగణములు గల్గి యతిప్రాసములతోఁ గూడినవి జాతులు.

కందము—కందమునకు ఒకటి మూఁడు పాదములలో మూఁడేసిగణములును, రెండునాల్గు పాదములలో నయిదేసిగణములు నుండును. ఒకటి మూఁడుపాదములలో యతి యుండదు. రెండు నాల్గు పాదములలోఁ మూఁడు గణములమీఁద, అనఁగా నాల్గవగణము మొదటియక్షరమున యతి నిల్చును.

గగ, భ, జ, స, నల, ములలో నేగణములయిన నుండవచ్చును; పూర్వార్ధములో అనఁగా 1, 2 పాదములలో మొత్తము గణములు 8. ఉత్తరార్ధములో, అనఁగా 3, 4 పాదములలో 8 గణములు. ఈరెండుభాగములలోను బేసిని జగణ ముండదు. (అనఁగా 1, 3 పాదములలో, 1, 3 గణములును, 2, 4 పాదములలో, 2, 4 గణములును జగణములు కారాదు.) ఆఱవ గణము నలముగాని జగణముగాని కావలయును. (అనఁగా 2, 4 పాదములలోని మూఁడవగణము నల, జ ములలో నేదైనను గావలయును.) ఈరెండుభాగములతుదిని గురు వుండవలయును. (అనఁగా 2, 4 పాదములలోని చివరిగణము గగము గాని, సగణము గాని కావలయును.)

కందము మూఁడైదుగణా
లందును గాభజసనలము లగు వడి మూఁటన్
పొందును నలజల నాఱిట
నొందుం దుది గురువు జగణ ముండదు బేసిన్.

ఉపజాతులు

ఇనేంద్రగణములు గల్గి యతితోఁ గూడినవి యుపజాతులు. ఇందుఁ బ్రాస ముండదు. యతికి బదులుగాఁ బ్రాస ముండవచ్చును. దీనికే ప్రాసయతి యని పేరు.

తేటగీతి—ఒకసూర్యగణము, రెండింద్రగణములు, రెండు సూర్యగణములు నుండును. ప్రతిపాదమునందును మూఁ[illegible]

గణముల తరువాత నాల్గవగణము మొదటియక్షరమున యతి నిల్చును.

ఇనునిపై నిద్దఱింద్రులు నిద్దఱినులు
వాటముగ మూఁటిపై యతి తేటగీతి.

ఆటవెలఁది—ఒకటి మూఁడు పాదములలో మూఁడు సూర్యగణములు రెం డింద్రగణములును, రెండు నాల్గు పాదములలో అయిదును సూర్యగణములు నుండును. తేటగీతిలో వలెనే యిందును నాల్గవగణము మొదటి యక్షరమున యతి నిల్చును.

ఇనగణత్రయంబు నింద్రద్వయంబును
నగును బంచసూర్యు లాటవెలఁది.

సీసము—ఆఱింద్రగణములు రెండు సూర్యగణములు నుండును, ఈపాదమును రెండుభాగములుగాఁ జేసిన మొదటి భాగమున 4 ఇంద్రగణములును, రెండవభాగమున రెం డింద్రగణములు రెండు సూర్యగణములు నుండును. రెండుభాగములందును రెండవగణముమీఁద యతి. సీసమునకుఁ జివర ఆటవెలఁదిగాని, తేటగీతిగాని యుండవలయును.

ఇంద్రగణము లాఱు నినగణంబులు రెండు
యతిని రెంటను రెంట సతుకవలయు
ఆటవెలఁదియైన తేటగీతియునైన
సీసములకు మీఁదఁ జెప్పవలయు.

ద్విపద—ప్రతిపాదమునకుఁ దొలుత మూఁ డింద్రగణములు, మీఁద నొకసూర్యగణము నుండును. మూఁడవగణము

మొదటియక్షరమున యతి నిల్చును. దీనికి రెండుపాదములే యుండును.

ఇంద్రగణములు మూఁడిటఁ దొక్కరుండు
యతిని రెండిటిమీఁద సేతుకంగ ద్విపద.'

ఈయుపజాతులపాదములలోని యక్షరములు సమాన సంఖ్యగలవై యుండవు. ఇనగణములలోని నగణమునకు మూఁడక్షరములు, హగణమునకు రెండక్షరములు, ఇంద్రగణములలోని నల, నగ, సలములు నాలుగక్షరములు గలవి. 'భ ర త' లకు మూఁడక్షరములు, ఈభేదముచే నక్షరముల సంఖ్య సమముగా నుండదు. ఇట్లే జాతులలోఁ గూడ చతుర్మాత్రాగణములలో 'గా' అనుదానికి రెండును భ జ స లకు మూఁడును, నలమునకు నాలుగును వర్ణము లుండుటచే నచటఁ గూడ సంఖ్య సమముగా నుండదు, ఇఁక వృత్తములలో నిసర్గగణము లెల్ల నియతములై యుండుటచేఁ బాదాక్షరసంఖ్య సమముగనే యుండును.

ఏ పద్యభాగమైనా కనుగొను విధము.

చివర గురు వున్నచో నది వృత్తమో లేక కందమో యగును. వృత్తములలోని పాదములందు వర్ణములసంఖ్య సాధారణముగా 19 మొదలు 21 వఱకు నుండును. చివర గురువుండి,21 అక్షరములకంటె నెక్కువ యున్న నది కందమే యగును. చివర గురువుండి, ఆయావృత్తముల గణములు వరుసగా నుండిన వృత్తములే యగును. చివర లఘు వుండిన, తేటగీతి, ఆటవెలఁది, సీసము, ద్విపద, అక్కర వీనిలో నేదియో యొకటి తప్పక యగును.

# అలంకార ప్రకరణము.

## కావ్యములు

సంస్కృతవాఙ్మయమున వేదములు పురాణములు కావ్యములు మనుజుని కర్తవ్యాకర్తవ్యయములను బోధించుచుండును. వీనిలో వేదములు ప్రభుసమ్మితములు. అనఁగా "సత్యమును బలుకుము; ధర్మమునాచరింపుము; ఏ ప్రాణిని హింసింపకుము." అని ప్రభువువలె విధినిషేధరూపమున బోధించును; గాన వేదములు ప్రభుసమ్మితములు. పురాణములు సుహృత్సమ్మితములు. ఆప్తుఁడగు మిత్త్రుఁడు తనచెలికానికి దృష్టాంతపురస్సరముగ హితాహితములను బోధించును. పురాణములు నట్టులే దృష్టాంతముఖమున "రామాదులవలె వర్తింపుము; రావణాదులవలె వర్తింపకుము." అని బోధించును గాన సుహృత్సమ్మితములు. కావ్యములు కాంతాసమ్మితములు. కాంత వింతదైన హావభావములతోను, సౌశీల్యాదిగుణములతోను, హారనూపురాద్యలంకారములతోను, నొప్పారి తన పతిమనమును దనవైపునకు మరల్చుకొని తనయభీష్టమును సంపాదించుకొని, భర్తను సన్మార్గప్రవర్తకుని నొనరించునట్లు, వ్యంగ్యములైన హావభావములు, ప్రసాదమాధుర్యాదిగుణములు, ఉపమారూపకాద్యలంకారములు గలిగిన కావ్యములు సహృదయుల హృదయమును నాకర్షించి సదసన్మార్గముల నుపదేశించును. కావునఁ గావ్యములు కాంతాసమ్మితములు. లోకములోఁ జతురయైన భార్య తనయభీష్టమును భర్తతోఁ గంఠోక్తముగఁ జెప్పక

"ఈనాఁడు నేను మీనాక్షి మెడలో హారముఁ జూచితని. ఎంతి యు నందముగా నున్నది. ఆమె పుణ్యమెట్టిదో ? అమె నోటి నుండి మాట వచ్చినది తడవుగ భర్త యామె కోరిన నగ లన్ని యుఁ దెచ్చిపెట్టును." అని వ్యంగ్యముగ బోధించును. కావ్య ములు నట్లే వ్యంగ్యముగనే కర్తవ్యాకర్తవ్యములును బోధిం చును.

### కావ్యలక్షణము.

గుణాలంకారములతోఁ గూడి దోషములు లేనిశబ్దార్థ ములు కావ్య మని కొందఱిమతము. రసభావభరితమై గద్య పద్యాత్మకమైన వాక్యము కావ్య మని మఱికొందఱి మతము. కాని యీ మతమున వస్త్వలంకారధ్వనిప్రధానమైనది కావ్య ము కాకుండఁ బోవలసివచ్చును. చమత్కారమును గలిగించు నర్థముతోఁ గూడినశబ్దము కావ్య మని తరువాతివా రనిరి. ఇట్టి కావ్యములు రసభావభరితములై కాంతాసమ్మితములై నీతి నుపదేశించుచుండవలె నని కావ్యతత్త్వజ్ఞుల నిర్ణయము.

మానవశరీరమునకు జీవిత మెట్టిదో కావ్యశరీరమునకు వ్యంగ్యములైన రసభావాదు లట్టివి. ఉత్తమ మానవజీవితము నకు శౌర్యగాంభీర్యాదిగుణము లెట్లు లావశ్యకములో ఉత్తమ కావ్యమునకు ప్రసాదము మాధుర్యము ఓజస్సు మున్నగు గుణ ము లట్లావశ్యకములు. సహజలావణ్యముతోఁగూడిన శరీరము నకు హారనూపురాద్యలంకారము లెట్లు సౌందర్యమును బ్రతి పాదించునో, శబ్దార్థచమత్కారములతోఁ గూడినకావ్యమునకు ఉపమాద్యలంకారములు నట్లే శోభను బెంపొందించును. మా నవ జీవితమునకు దోషవర్తనము లెట్లు పరిహార్యములో కావ్య

మున్నందు శబ్దార్థదోషము లట్లు వర్జ్యములు. ఈ తీరున శైలి పాకములు రీతులు మున్నగు సామగ్రులతోఁ గూడిన కావ్యము లుత్తమనీతిబోధకములై మానవజీవితమున కాదర్శప్రాయములై వొసలారును.

కావ్యమునఁ బ్రదర్శించు రసభావాదు లెప్పుడును వ్యంగ్యములే యగును గాని వాచ్యములు గానేరవు. అలౌకిక చమత్కారమును గలిగించుచు నఖండానందమును గలిగించు కావ్యము నవరసభరితమై యుండవలెను. అనఁగా శృంగారాది రసములలో నొక రసము ప్రధానముగను మిగిలిన రసము లంగములుగను నుండవలెను.

### రసస్వరూపము

కావ్యములలోఁ గవులు ప్రదర్శించు రసములు తొమ్మిది-
1. శృంగారము, 2. హాస్యము, 3. కరుణము, 4. రౌద్రము, 5. వీరము, 6. భయానకము, 7. బీభత్సము, 8. అద్భుతము, 9. శాంతము.

వీనికి వరుసగా నీ క్రిందివి స్థాయిభావములు—

1. రతి, 2. హాసము, 3. శోకము, 4. క్రోధము, 5. ఉత్సాహము, 6. భయము, 7. జుగుప్స, 8. విస్మయము, 9. శమము.

ఈ స్థాయిభావములు విభావములు అనుభావములు, సాత్త్వికభావములు, వ్యభిచారిభావములు అను నాలుగు విధములయిన భావముల సంయోగమునఁ బరిపుష్టినంది రసరూపములై (అఖండానందస్వరూపములై) పరిణమించును. లోకము

నందు తంతువులు (నూలుదారములు)—కండె, ఆసు, మగ్గము, సాలె మున్నగు సామగ్రిల సాయముచే నొకదానితో నొకటి గూడి వస్త్రముగా మాఱును. ఇట్లే స్థాయిభావములు, విభావాదుల కలయికచే క్రమవికాసము నంది రసముగ మాఱును. రసముల భేదమును బట్టి విభావాదులును భిన్నభిన్నములుగా నుండును.

### రసనిష్పత్తి.

"విభావానుభావవ్యభిచారిసంయోగా ద్రసనిష్పత్తిః" అని భరతముని ఆ సూత్రించియున్నాఁడు. అనఁగా స్థాయి భావము, విభావానుభావవ్యభిచారిభావముల సంయోగమున రసస్థితికి వచ్చును. విభావము ఆలంబనము ఉద్దీపనము అని రెండు విధములు. ఇవి స్థాయిభావమున కాధారమైనవి. అనఁగా నిలీనమైన స్థాయిభావము దేని నాధారముగఁ జేసికొని యభివ్యక్త మగునో యది యాలంబనవిభావము. అభివ్యక్తమైన స్థాయిభావము నుద్దీపింపఁజేయునది యుద్దీపనవిభావము.

శృంగారము—దీనికి రతి (ప్రేమ) స్థాయిభావము. దుష్యంతునిప్రేమకు శకుంతల ఆలంబనవిభావము. ఇట్లే శకుంతలప్రేమకు దుష్యంతుఁడు ఆలంబనవిభావము. శకుంతలను జూచుటచే నభివ్యక్తమైన దుష్యంతునిరతి శకుంతల యేకాంత స్థితిచేతను, సఖీసంభాషణాదులచేతను నుద్దీపింపఁబడుట్లైనవి యుద్దీపన విభావములు.

వీరము—భీమునియుత్సాహ మనుస్థాయి భావమునకు దుర్యోధనుఁ డాలంబనవిభావము. రణభేరీనినాదములు మొదలగునవి యుద్దీపనవిభావములు.

కరుణము—తల్లి శోకమునకు మరణించినపుత్రుఁ డాలంబన విభావము. మిగిలిన రసముల కిట్లే తెలియవలెను.

అనుభావములు—స్థాయిభావ ముద్దీపితమైన తరువాత శరీరమునందుఁ గొన్నిచేష్టలు పొడమును. వాని ననుభావము లందురు. హృదయమునం దొకభావ ముత్కటమై ప్రజ్వలించు నపు డది చేష్టారూపముగ వెలువడును. అట్టి చేష్టలనే అనుభావము లందురు. దుష్యంతునకు శకుంతలవిషయమైన రతి ప్రజ్వలితమైన తరువాత క్రేఁగంటఁ జూచుట,కులనామాదికము లడుగుట మున్నగునవి యనుభావములు. ఇట్లే దుర్యోధనుని జూచినపుడు భీముని యుత్సాహము మిక్కుటము కాఁగా,కన్నులెఱ్ఱఁజేయుట పండ్లుకొఱుకుట బాహువు లప్పళించుట సింహనాదము సేయుట మున్నగునవి యనుభావములు. ఇట్లే పుత్రి మరణమునకై పరిదేవన మొనర్చు తల్లి కన్నీరు కార్చుట ఱొమ్ము బాదుకొనుట నేలపైఁ బొరలుట యిట్టివి యనుభావములు.

సాత్త్వికభావములు—స్థాయిభావ మత్యుత్కటమైనపుడు కలిగెడి అనుభావములే సాత్త్వికభావములు. ఇవి యెనిమిది విధములు. 1. స్తంభము (కొయ్యఁబాఱుట) 2. ప్రళయము (చైతన్యములేకపోవుట) 3. రోమాంచము (ఒడలు గగుర్పొడుచుట) 4. స్వేదము (చెమట పొడముట) 5. వైవర్ణ్యము (వెలవెలఁబోవుట) 6. వేపథువు (కంపము) 7. అశ్రువు (కన్నీరు పొడముట) 8. వైస్వర్యము (కంఠము బొంగురుపోవుట) ఇవి యన్ని రసములకు సమానములు.

## వ్యభిచారిభావములు — లేక సంచారిభావములు

స్థాయిభావ మత్యుత్కట మైనపుడు, దాని ననుస రించి క్షణికము లైన పెక్కు భావములు పొడముచుండును. వానిని వ్యభిచారి భావము లని యందురు. దుష్యంతుని రతియం దలి హర్షము, సమాగమోత్కంఠ, గ్లాని మున్నగునవి వ్యభి చారిభావములు. భీముని యుత్సాహమున గర్వము, కోపము, మున్నగునవి.

ఈవిధముగ స్థాయిభావములు విభావానుభావ వ్యభి చారిభావముల సంయోగముచేఁ బరిపుష్టి నంది, అఖండానంద రూపమయిన రసముగఁ బరిణమించును. అది యెట్లన— లౌకిక ప్రపంచము సుఖదుఃఖసమ్మిశ్ర మైనది. అలౌకికప్రపంచము సుఖదుఃఖాతీతమై యానందమయ మైనది. లౌకిక మైనవస్తువు లన్నియు మమతాహంకారములచే సుఖమును దుఃఖమును గలి గించును. అలౌకికవిషయములు సుఖదుఃఖముల కతీతములై కేవల మానందమును గలిగించును.

ప్రతిభాశాలియైన కవి రచించిన నాటకమును, కళాకుశ లు రగునటు లభ్యాసపాటవముచే నభినయించునపుడు సామాజి కుల హృదయము, తాత్కాలికముగ లౌకికప్రపంచమున కతీత మై పానకరసమువలె నాస్వాదింపఁబడునదియు, సర్వాంగముల నాలింగనముచేయునదియు హృదయములోనికిఁ జొచ్చుకొని పోవునదియు మఱియొక వస్తువేదియుఁ గానరాకుండఁ జేయు నదియు నగుబ్రహ్మానందముతోఁ దులదూగు నానందమ ననుభవించును. ఇట్టి యానందము నే రస మందురు. యోగినిర్వి

కల్పనసమాధియం దనుభవించునానందమునకు రసమునకుఁ గొంత భేదము గలదు. యోగి సమర్థుఁ డైనచోఁ దనయానందము నెంతకాలమైనను బొడిగింపఁగలఁడు. కాని సామాజికుల యానందము, నటు లెదురుగ నాట్యము చేయుచున్నంతవఱకే యుండును.

ఆనంద మొక్కటియే యైనను రసములయందలి భేదము, స్థాయిభావములయందలి భేదమును బురస్కరించుకొని యేర్పడినది. రత్యాదిప్రదర్శనమున నెట్టి యానందము గల్గునో, కావ్యముఖమున శోకాదిప్రదర్శనమునఁగూడ నట్టియానందమే గలుగును. లోకమున రత్యాదులు సుఖమును శోకాదులు దుఃఖము నొసఁగును. అచ్చట మమతాహంకారాదు లుండుటచే నట్టిస్థితి యేర్పడును. అవిలేని కావ్యాది కళాప్రపంచమున రత్యాదుల వలనను శోకాదులవలననుగూడ నానందమే గలుగును. లోకమునఁ బుత్రమరణమునకై పరిదేవనము సేయు మాతృదుఃఖమును జూడలేనివారుకూడ, నాటకమున హరిశ్చంద్రాదుల దుఃఖమును జూచి మరలిపోక, పలుమాఱులు చూడఁ గుతూహలపడుట కిదియే కారణము.

### కావ్యభేదములు

రసము లిట్టి యలౌకికానందము నిచ్చునట్టివి గావుననే ఉత్తమకావ్యకర్తలు తమకావ్యములను రసపరిపుష్టముల నొనర్చిరి.

ఈ కావ్యములు దృశ్యములు శ్రవ్యములు అని రెండు విధములుగ లెక్కింపఁబడును. దృశ్యము లనఁగా నభినయప్రద

ర్శనముచే సహృదయులగు ప్రేక్షకులకు నానందమును గలిగించు నవి. వీనినే రూపకము లని యందురు. ఇవి పదివిధములు. 1. నాటకము, 2. ప్రకరణము, 3. భాణము, 4. ప్రహసనము, 5. డిమము, 6. వ్యాయోగము, 7. సమవాకారము, 8. వీథి, 9. అంకము, 10. ఈహామృగము. కథావస్తువును బట్టియు, నాయకుని బట్టియు, రసమును బట్టియు నీ భేదము లేర్పడును.

శ్రవ్యకావ్యము లనఁగా శ్రవణముచే (వినుటచే) సహృదయుల కానందము గలిగించునవి. రఘువంశము మున్నగునవి. ఇవి మరల మూఁడు విధములు. గద్యకావ్యములు, పద్యకావ్యములు, ఉభయములు.

గద్యకావ్యములు—సంస్కృతమున వాసవదత్త, దశకుమారచరితము, కాదంబరి మున్నగునవి. తెలుఁగున జైమిని భారతము నీతిచంద్రిక మొదలగునవి. ప్రాచీనకాలమునఁ దెలుఁగువాఙ్మయములో గద్యకావ్యము లంతగఁ గానరావు. తరువాత మధుర తంజావూరులలో నాయకరాజుల పరిపాలన కాలమున జైమినిభారతము విష్ణుపురాణము మొదలగునవి కొలఁదిగనే గానవచ్చుచున్నవి. పందొమ్మిదవ శతాబ్ది యుత్తర భాగమునుండి తెలుఁగులో గద్యకావ్యములు ప్రబలము కాఁ జొచ్చినవి.

పద్యకావ్యములు—సంస్కృతభాషలో కాళిదాసాది కవులు రచించిన రఘువంశము కుమారసంభవము కిరాతార్జునీయము, శిశుపాలవధము, నైషధము మొదలగునవి, తెలుఁ

గున వెనుకటిశతాబ్దులలో తిక్కన నిర్వచనోత్తరరామాయణ
ము దక్క కేవల పద్యకావ్యము లంతగఁ గానరావు. ఇరువది
యవశతాబ్దిలో మాత్రము కేవలపద్యకావ్యము లెన్నియో
జయలు దేరినవి.

ఉభయములు—గద్యములు పద్యములు గలిగినకావ్య
ములను సంస్కృతమున 'చంపువు' లందురు. వీనిని దెలుఁగులో
'ప్రబంధము' లని యందురు. నన్నయభట్టారకుఁడు మొదలు
చిన్నయసూరివఱకు నడుమ నున్నకవు లందఱును ఈప్రబంధ
రచనమునే సాగించిరి.

ఈకావ్యములు ఉత్తమములు మధ్యమములు అధమ
ములు అని మరల మూఁడు విధములు. మహాకావ్యము లుత్తమ
కావ్యములు. వీనిలో నొక నాయకుని చరిత్ర మాదినుండి తుది
వఱకుఁ వర్ణింపఁబడును. అతఁ డనుభవించిన వివిధములైన
సుఖదుఃఖములు, అతని జీవితఘట్టమునందలి పలువిధములయిన
సంఘర్షణము లిందుఁ బ్రదర్శింపఁబడును. ఇట్టి కావ్యములందలి
యితివృత్త ముపక్రమోపసంహారములతో, ననుగతముగ నుం
డును. కథ శాఖోపశాఖలతో విస్తృతమై నవరసభరితమై
చర్వణావస్థకుఁ గొనిపోవునదిగ నుండును.

మహాకావ్యలక్షణము నాలంకారికు లిట్లు వాకొని
యున్నారు. ఉత్తమనాయకచరిత్రము నూఁతగఁ గొని శృంగార
కరుణ వీరరసములలో నొకరసము ప్రధానముగను,ఇతరరసము
లంగములగను గూర్చి యష్టాదశవర్ణనములతో నొప్పునది మహా
కావ్యము. ఈకావ్యమునందలి యితివృత్తము పురాణేతిహాసా

దులనుండి గై కొనఁబడును. రసపరిపుష్టిదృష్టితో మూలములో లేని కొన్ని యంశములను జేర్చుటయుఁ గొన్నిటిని వదలుట యుఁ గూడ నుండవచ్చును.

అష్టాదశవర్ణనములు—1. పట్టణము, 2. సముద్రము, 3. పర్వతము, 4. ఋతువులు, 5. చంద్రోదయము, 6. సూర్యోదయము, 7. ఉద్యానము, 8. జలక్రీడ, 9. మధుపానము, 10. రతోత్సవము, 11. విప్రలంభము, 12. వివాహము, 13. కుమారోత్పత్తి, 14. కార్యాలోచనము, 15. జూదము, 16. ప్రయాణము, 17. యుద్ధము, 18. నాయకాభ్యుదయము. తొలుత నీ యష్టాదశవర్ణనములను సంస్కృతకవులు తమకావ్యములలోఁ గూర్చినారు. తరువాతఁ దెనుఁగుకవు లావరిపాటిని దమ రచనలలోఁ జొప్పించిరి. పురాణానువాదమున మొదట నివి పొడసూపి క్రమముగ శ్రీనాథునికాలమున సర్వాంగపరిపుష్టము లైనవి. రానురాను ప్రబంధయుగమున నీయష్టాదశవర్ణనములు విశేషవికాసము నందినవి. రసపరిపోషముకంటెను మహాకావ్యత్వసిద్ధికై యీయష్టాదశవర్ణన పరిపుష్టిదృష్టి హెచ్చయినది. ఇది యిరువదియవశతాబ్దమున ఖండకావ్యారంభముతో నడలినది.

మధ్యమకావ్యములు—వీనినే ఖండకావ్యము లందురు. వీనిలో నొక నాయకుని జీవితమునందలి యొక రసవద్ఘట్టము మాత్రమే ప్రదర్శిత మగును. అతని పుట్టుట గిట్టుట యారావవిక్షితములు గావు. అతఁ డనుభవించిన యాజీవితఘట్టము చర్వణాస్థితికిఁ గొనిపోఁబడును. సంస్కృతమున మేఘసందేశ

మిట్టి ఖండకావ్యము. యక్షుఁ డెప్పుడు పుట్టెనో? యేమయ్యె నో తెలియదు. కుబేరుని సంవత్సరశాపకాలమున యక్షుఁ డనుభవించిన విప్రలంభ మిం దద్భుతముగఁ బ్రదర్శింపఁబడినది.

ఆధునికులు ఖండకావ్యములలో చరిత్రాత్మకముగఁ బ్రసిద్ధమైన యొక ఘట్టము నూఁతగఁగొని, లలితపదసన్నివేశ ముగల మధురశైలిలో నాదర్శప్రాయమగు మానవచరిత్ర మును జిత్రించుట, ప్రబంధములందువలె నష్టాదశవర్ణనములు నలంకారములయాడంబరము లేకుండుట, భావములు లలితము లగుట, ప్రకృతిచిత్రణమునందు పాత్ర స్వభావపరిపోషణమునం దును నైసర్గికత యుండుట యనువానిని బాటించుచున్నారు. ఇరువదియవ శతాబ్దమునం దిట్టిఖండకావ్యములు తఱచుగ బయలుదేఱినవి.

అధమకావ్యములు—శతకాదు లీవర్గమునకుఁ జేరును. ఇవి అనుగతమైన యొక యితివృత్తము లేని వగును. ఏపద్య మున కాపద్యము ఒక్కొక్క-భావము, గలిగి తన్మయత్వము గలిగించుకూర్పు లేకయుండును. కావ్యజీవితమైన రస మిందు చర్వణాస్థితికిఁ గొనిపోఁజాలదు.

### గుణములు

ఉత్తమకావ్యములందుఁ గవులచే ముఖ్యముగఁ బాటింపఁ బడినవి గుణములు, ఇవి రసధర్మములు, శౌర్యధైర్యాదు లెట్లు ఆత్మనిష్ఠములో నివియు నట్లే రసనిష్ఠములు. అలంకారములు శబ్దార్థధర్మములు. అవి కావ్యమునందలి బాహ్యశరీరమునకే శోభపుష్టిని గలిగించును. ఈగుణములలో ముఖ్యములు మూఁడు.

1. ప్రసాదము, 2. మాధుర్యము, 3. ఓజస్సు.

ప్రసిద్ధమైన యర్థముగల పదములు గలిగియుండుట ప్రసాదము.

అండజయాన ! నీ వాసఁగునట్టి సపర్యలు మాకు వచ్చె నిం
దుండఁగ రాదు పోవలయు నూరికి; నింటికి నిప్డు డేను రా
కుండ నొకండు వచ్చి మఱియుండునె? భక్తియ చాలు; స
త్క్రియాకాండము దీర్ప వేగఁ జనఁగావలయుం గరుణింపు
నా పయిన్.

దీర్ఘసమాసములు లేక చెవికి విన నింపైన పద్యములు గలిగియుండుట మాధుర్యము.

అందున కెంతయుం బ్రమద మందుచుఁ బుష్పితవల్లులందు నిం
దిందిరశాబకంబు పువుఁదేనియ గ్రోలెడిరీతి నూర్వరం
బొంది సుధారసగ్రహణభూరిసుఖంబుల నొందుచున్ శతా
నందుఁడనంగ నొప్పెసఁ గెనాఁడు మొదల్కథలన్విధాతయున్.

దీర్ఘసమాసములతోఁ గూడినపదముల కూర్పు ఓజస్సు.

సింగంబాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమైనుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చునో
జం గాంతారనివాసఖిన్నమతి నన్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

అలంకారములు.

ఇవి రెండు విధములు. 1. శబ్దాలంకారములు. [illegible]లంకారములు. శబ్దములకు సొగసును గలిగించునవి శబ్దాలంకారములు. అర్థమునకు సొగసును గలిగించునవి అర్థాలంకారములు

## శబ్దాలంకారములు

1. వృత్త్యనుప్రాసము—ఒకటిగాని యెక్కువగాని హల్లులకుఁ బలుమాఱు లావృత్తి వచ్చినచో వృత్త్యనుప్రాసము.

   చొక్కపుటుక్కు క్రిక్కిఱిసి స్రుక్కక పెక్కువ నక్కజంబుగన్.

2. ఛేకానుప్రాసము—రెండుహల్లులు వ్యవధానము లేకుండ మరల వచ్చుచో ఛేకానుప్రాసము.

   కందర్పదర్పదములగు సుందరదరహాసరుచుల సుందరి యంద మొప్పుచున్నది.

3. యమకము—అచ్చుతోఁగూడిన హల్లులు మరల వచ్చుచో యమకము. ఇందు అచ్చులును హల్లులునుగూడ నావృత్తి చేయఁబడును. ఛేకానుప్రాసవృత్త్యనుప్రాసములలో హల్లులుమాత్రము తప్పక యావృత్తము లగును. అచ్చులు మాఱినను నిబ్బంది లేదు. ఉదా:—మనస్సైన మనస్సైసిక నికాయంబులోఁ గాయంబు గాయంబు వడనివాఁడు లేఁడు.

## అర్థాలంకారములు.

1. ఉపమాలంకారము:—ఒక వస్తువునకు మఱియొక వస్తువుతో రమణీయముగాఁ బోలిక చెప్పుట యుపమాలంకారము.

ముఖము చంద్రునివలె సుందరమైనది.

ఇచట ముఖమునకుఁ జంద్రునితోఁ బోలిక చెప్పఁబడినది. దేనితోఁ బోలిక చెప్పఁబడినదో యది యుపమానము. దేనికిఁ బోలిక చెప్పఁబడునో యది యుపమేయము. పోలికను

దెలుపు పదము ఉపమావాచకము. ఏగుణముచేఁ బోలిక చెప్పఁ బడునో యది సమానధర్మము. ఇచట ముఖము ఉపమేయము. చంద్రుఁడు ఉపమానము. వలెను అనునది యుపమావాచకము సౌందర్యము సమానధర్మము.

క. ఉదరభిదాముఖమున స
భ్యుదితుండై నిర్గమించె బుధసుతుఁడు కచుం
డుదయాద్రిదరీముఖమున
నుదితుం డగు పూర్ణహిమమయూఖుఁడు పోలెన్.

2. రూపకాలంకారము :— ఉపమానమును ఉపమేయమును ఒక్కటే యని చెప్పుట రూపకాలంకారము.

'ఈముఖము చంద్రుఁడే' ఇచట నుపమేయ మగుముఖమును, ఉపమాన మగు చంద్రుఁడును నొక్కటిగాఁ జెప్పఁబడినవి. ఇట్లే "ముఖ మనెడి చంద్రుఁడు" అనుచోటను, ఈయర్థముగల "ముఖచంద్రుఁడు" అను సమాసమునందును రూపకాలంకారమే.

3. ఉత్ప్రేక్షాలంకారము-సొగసుగా నూహించుట యుత్ప్రేక్ష.

గీ. రాజా ! నీప్రతాపముయొక్క వేఁడినిఁగూర్చి విని యవమానముచేఁ గాబోలు దావాగ్ని యడవులపా లయ్యెను.

దావాగ్ని యడవులలో నుండునదియే. అయినను రాజు ప్రతాపముకంటెఁ దన వేఁడిమి తక్కువ యైపోవుటచే నవమానపడి యడవులకుఁ బోయెనేమో యని కవి సొగసుగా నుత్ప్రేక్షించియున్నాఁడు.

తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖవ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణిదాల్చె కషాయదీధితిన్.

"పరీక్షకుఁ జనువుచున్నది విద్యార్థీ! త్వరగా లెమ్ము, బాగుగా బోధపడుటకై ప్రశాంతసమయమునఁ జదువుకో. బాగుగా బోధపడుచుకో. పరీక్షలో జయము సంపాదించుకో." అని విద్యార్థిని లేపుటకుఁ గాఁబోలు కోళ్లు గూయుచున్నవి.

తెల్లవాఱుజామునఁ గోళ్లు కూయుట స్వభావమే. అయినను రాత్రి మేలుకొని, మొద్దునిద్ర పోవుచున్న విద్యార్థియందలి ప్రేమచే, వానిని లేపుటకుఁ గాఁబోలు నిట్లు కూయుచున్న వని కవి చమత్కారముగ నుత్ప్రేక్షించియున్నాఁడు.

4. అతిశయోక్త్యలంకారము:—ఒక వస్తువును మిగుల నతిశయముగా (గొప్పగా) వర్ణించుట యతిశయోక్తి.

ఈ పురమందలి మేడలు చంద్రమండలమ్ము నతిక్రమించినవి. తన గమనమున కీమేడ లడ్డువచ్చుటచేఁ జంద్రుఁ డీమేడల యావలికిటికీలగుండ లోనికిఁ జొచ్చి, మరల నావలికిటికీలగుండ బయటికిఁ బోవుచు,తన ప్రయాణము సాగించుచున్నాఁడు.

మేడ లెంత యెత్తుగా నున్నను చంద్రమండలమువఱకు వ్యాపించుట యసంభవము. అయినను అట్లు వర్ణించుట యతిశయోక్తి. ఇట్లు చెప్పుటచే నీమేడలు మిక్కిలి ఎత్తుగా నున్న [illegible] యారము.

అన్నగరి చిఱుత యేనుఁగు
గున్నలపై నెక్కి నిక్కి కోయఁగవచ్చున్
మిన్నేటిపసిఁడితామర
లన్న న్నఱి యేమి చెప్ప నందలికరులన్.

5. స్వభావోక్త్యలంకారము:—ఒక వస్తువును స్వభావ సిద్ధ మగునట్లు సొగసుగా వర్ణించుట స్వభావోక్తి.

ఒక యుద్ధముగాని, ఉత్సవముగాని, పెండ్లియందలి పేరంటాండ్ర తొందఱలుగాని, అత్తకోడండ్ర వాక్కలహములు గాని, యిప్పుడు మనకన్నులయెదుట జరుగుచున్న వేమో యను నట్లు వర్ణించుట

"ఓసి పోవే యన్న నోసి పోవే యంచు..." ఈ మొదలుగ కళాపూర్ణోదయములోని మాయారంభాసత్యభామల దెబ్బలాట దీని కుదాహరణము.

శ్రేణుల్ గట్టిన భోంతరాళమునఁ బాఱెం బక్షు; లుష్ణాంశుపా
షాణవ్రాతము కోష్ణమయ్యె మృగతృష్ణావార్థు లింకెన్; జపా
శోణం బయ్యెఁ బతంగబింబము; దిశాస్తోమంబు శోభాదరి
ద్రాణంబయ్యె; సరోజషండములు నిద్రాణంబు లయ్యెం గడున్.

6. అర్థాంతరన్యాసాలంకారము:—ఒక సంగతిని సమర్థించుటకై మఱియొకసంగతిని జెప్పుట యర్థాంతరన్యాసము.

"పాప మీబాలుని కళాశాలాధికారులు కఠినముగా శిక్షించినారఁట! ఔను. తప్పుచేసిన వారిని పెద్దలు శిక్షింపరా?" ఇచట కళాశాలాధికారులు కఠినముగా శిక్షించినా రన్నసంగతిని సమర్థించుటకై తరువాతివాక్యము చెప్పఁబడినది. అనఁగా

మొదటిసంగతి వినఁగానే "అయ్యో! పాపము, ఈబాలుఁడు గొప్పతప్పు చేసినాఁడే యనుకొందము. అయినను తల్లిదండ్రులను వదలి దూరము వచ్చి విద్యకొఱకై పలుకష్టముల పాలగుచున్న యీ పసివానిని శిక్షించుటకై యీయధికారి కెట్లు మనసొప్పెను." అనెడి యాక్షేపణము రాఁగా, నధికారి యట్లు చేయుట న్యాయమే యని తెల్పుటకై రెండవసంగతి చెప్పబడెను.

జలజాతాసనవాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధుఁగన్నతండ్రిశిరమచ్చో వామపాదంబునం
దొలఁగంద్రోచె లతాంగికట్టెదుట "నాథుల్నేరముల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారము ల్నేర్తురే"॥

7. విషమాలంకారము:—ఒక సంగతిని జెప్పి, దానికి బొత్తిగా సంబంధములేని మఱియొకసంగతి చెప్పి అది యెక్కడ యిది యెక్కడ అని చెప్పుట విషమాలంకారము.

(1) నక్క యెక్కడ? నాకలోక మెక్కడ?
(2) నీ వెక్కడ? పరీక్షాధికారి వగుట యెక్కడ?

8. యథాసంఖ్యాలంకారము: కొన్ని సంగతులు చెప్పి, వానికి సంబంధించిన మఱికొన్ని సంగతులను జెప్పి, యందు మొదటిదానికి మొదటిదియు, రెండవదానికి రెండవదియు. నిట్లు సంబంధపఱచుచో నదట యథాసంఖ్యాలంకారము, లేక క్రమాలంకారము. "కచ్ఛపమూషికములు జలబిలములఁ దూఱెను." కచ్ఛపము (తాఁబేలు) జలమునను, మూషికము బిలమునను దూఱెను.

**Books by the same Author.**

1. కుసుమకుంతలము (పద్యకావ్యము) ... 1—8—0
2. విజయవిహారము ( ,, ,, ) ... 1—8—0
3. ఆంధ్రలక్షణసారము-రెండవ భాగము 0—12—0

*For Copies:—*

**Chilukuri Bros,**

Suryaraopeta,

**KAKINADA.**